

వంపుసొంపుల ప్రకృతి




జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణి !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

★

# స్త్రీలు — వరకట్నాలు

వరకట్నాల నిషేధంబిల్లు కేంద్ర పార్లమెంటులో ప్రతిపాదించబడిన సందర్భమున చెలరేగినదుమారం వాంఛనీయమైనది కాదని చెప్పవలసియున్నది. ముఖ్యంగా వరకట్నాలను యిచ్చినవారిని, పుచ్చుకున్నవారిని శిక్షార్హులుగాచేయడంతోబాటు వరకట్నాలుయిచ్చి పుచ్చుకోడాన్ని ప్రోత్సహించిన వారిని సయితం శిక్షార్హులుగా చేయాలనడం సహేతుకం. ఈ ప్రోత్సాహం ఏరూపంలోనున్నా అవాంఛనీయమే యగును. కట్నములనివ్వజూపడం సయితము ప్రోత్సహించుటయే కాగలదు కాబట్టి దానిని తప్పకనిషేధించి వరకట్నాల నివ్వజూపినవారిని చట్టరూపేణా శిక్షార్హులుగా నిర్ణయం జరుగాలి,

వరకట్నాల నిషేధం బిల్లుయొక్క ముఖ్య ఉద్దేశం యీనాడు బరువుభారంగా తోచుచున్న ఆడపిల్లల వివాహములను సుగమంచేయడమే. ఉండియో, లేకయో

కట్నాల నివ్వజాలి తమ ఆడపిల్లలకు కొందరు సామాన్యకుటుంబీకులు వివాహాలు చేసినచో యివ్వకలుగనివారిస్థితి అట్టి ప్రోత్సాహమును అరికట్టని శాసనంవలన ఏ విధంగాను మెరుగుపరచలేదు. ఈ వరకట్నాలవల్ల యీ నాడు ఏ వర్గాలు ఏపబాధలు పడుతున్నవో వానిని తొలగించి రక్షణ కల్పించడానికి అనువుగా చట్టం రూపొందాలి.

చట్టము క్రమబద్ధమైనదై, ప్రజల శ్రేయోసౌభాగ్యముల నుద్దేశించినదైనా దానిని ప్రజలు గుర్తించి చట్టమములుజరుగుటకు సహకరించనిచో చట్టంయొక్క ఉద్దేశలక్ష్యాలు సఫలముకాజాలవు.

వరకట్నాల చట్టం రూపొందే సందర్భమున, చట్టము రూపొందిన తరువాత ముఖ్యంగా స్త్రీలు ప్రత్యేక ఆసక్తితో బాటు అమలుజరుగునట్లుకూడ శ్రద్ధచూపాలి. చట్టం ఒకవైపున ఉన్నా స్త్రీలు వరకట్నాల నిషేధపు ఆవశ్యకతగుర్తించి సంఘసౌభాగ్యమునకు పూనుకున్నచో సామాన్యకుటుంబాలలోని ఆడపిల్లల వివాహాల సమస్యలు యీ నాటంత జటిలముగానుండవు. వరకట్ననిషేధమును బలపరచుటవలన ప్రతియొక్క స్త్రీ స్వీయ కుటుంబసౌభాగ్యంతో బాటు పతనావస్థలోనున్న అనేకకుటుంబాలను ఉద్ధరించి సజీవం చేయగలదు.

సంపన్నులు, యివ్వకలిగినవారు ఆడపిల్లల కుటుంబ సౌభాగ్యము నుద్దేశించి ఎప్పుడైనా, ఎంతైనా, ఏ రూపేణానైనా యివ్వవచ్చును. అది కట్నరూపంగానే, పెండ్లిసందర్భముననే ధనరూపంగా నివ్వ నవసరమంటూ యుండదు. ఇవ్వకలుగని స్థితిలోనున్నా, తమ ఆడపిల్లలకు పెండ్లి కాదేమోననే భయముతో అప్పోసప్పోచేసి లేదా ఆర్థికంగా చిత్తయి కట్నాలు యివ్వపూనుకున్నవారిని, తమ కుమారులకు కట్నాల కాశపడి ఉన్నతవిద్యలు గరపి, దానికి ఖర్చయిన మొత్తాలను కట్నాలుగా రాబట్టాలని ఆరాటపడేవారిని చట్టం నిరోధించి, అవసరమయితే శిక్షించాలి. స్త్రీలు తమ ఆడ, మగ సంతానముల వివాహసందర్భాలలో అందచందాలను, యీడుజోడును, యోగ్యతలను ప్రాముఖ్యముగా నెంచాలి. తల్లిదండ్రులు కుమారుల భవిష్యత్తు వారి శక్తిసామర్థ్యాలు, విద్యావిజ్ఞానములతో రూపొందాలని ఆశించాలి కాని వరకట్న మొత్తాలతో సుఖజీవనం చేయగలుగాలని ఆశించడం వాంఛనీయము కాదు. అట్టిది తల్లిదండ్రుల బలహీనతను, నైతికపతనాన్నే సూచిస్తుంది. యోగ్యతలను, ఈడుజోడును సయితం గుర్తించకుండా కట్నాల మోజులో వివాహములు జరిగి తర్వాత ఎందరి వైవాహిక జీవితములు ఎన్ని పెడదారులు త్రొక్కుతున్నదీ సంఘంలో విశేషంగా చూడనగును.

వివాహమనునది స్త్రీ, పురుషుల కిరువురకు జీవితసమస్య. వైవాహిక జీవితం కుటుంబాన్ని, సంఘాన్ని సౌభాగ్యవంతంగా చేయాలంటే వరకట్నాల దురాచారం

సమూలంగా నశించాలి. దానికి స్త్రీలు పూనుకొని ఒక ఉద్యమాన్ని నడిపి జాతీయ శ్రేయోసౌభాగ్యాలను తీర్చిదిద్దాలి!

---

## స్వవిషయం



భగవంతుని దయవల్ల, మీ ఆదరాభిమానములవల్ల 'గృహలక్ష్మి' యీ సంచికతో 29 సంపుటములు పూర్తియయినవి.

పూజ్యబాబు డాక్టర్ కే. యన్. కేసరిగారు 'గృహలక్ష్మిని' ని 1928 లో స్థాపించి నిర్వహించి జాతీయ, మహిళా ఉద్యమరంగాలలో అమూల్యమైన అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించారు. గృహలక్ష్మి పత్రిక ద్వారా జాతీయ ఉద్యమం ప్రోత్సహించబడింది. సారస్వతసేవ సయితం యితోధికం చేయబడ్డది.

ముఖ్యంగా మా గృహలక్ష్మి అభ్యుదయ రచనలను ప్రోత్సహించి అనేకమంది రచయితలను, రచయిత్రులను రూపొందించింది.

మహిళలలో ఆత్మవిశ్వాసాన్ని పురికొలిపి, విజ్ఞానవికాసాలను, సంచలనాన్ని కలిగించి యీనాటి మహిళాలోకంలోని వికాసానికి, మహిళా ఉద్యమవ్యాప్తికి గృహలక్ష్మి సర్వతోముఖంగా ఆనాడు యీనాడు కూడ తోడ్పడుతున్నది.

సంఘంలోని దురాచారాలను, అవాంఛనీయ స్థితిగతులను నిర్మూలింప తలపెట్టిన సంస్కరణలను గృహలక్ష్మి ప్రోత్సహించి ఉత్తమ నైతికవిలువలను అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించుచున్నది.

వీటన్నిటితోపాటు విజ్ఞానవినోదాల నుద్దేశించి కథానికలను, నాటికలను, గేయాలను, వ్యాసములను, తదితర శీర్షికలను మీకందిస్తూ గృహలక్ష్మి మీ ఆదరాభిమానములకు పాత్రమగుచుండుట మాకు గర్వకారణము. ఈ సందర్భమున మా కృతజ్ఞతను మీకు తెలుపుతూ ముందుముందు మరింతగా మీ సహాయసహకారములు లభించి సర్వాంగసుందరముగా 'గృహలక్ష్మి' వర్ధిల్లగలుగాలని ఆశిస్తున్నాము.

---

28.11-60 వ తారీఖున త్యాగరాయనగరు కేసరీ హైస్కూలు ఆవరణలో జరిగిన ఆంధ్ర సారస్వత సంఘ సమావేశమునకు కేసరీ విద్యాసంస్థల కార్యదర్శి దివాన్‌బహదూర్ శ్రీ బి. వి. శ్రీహరిరావు నాయుడుగారు అధ్యక్షత వహించిరి. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు ఆంధ్ర సంస్కృతీ జాతీయతల విశిష్టతను గూర్చి ఉపన్యసించారు. నన్నయాదికవులు, కవయిత్రులేగాక, రుద్రమ్మ మొదలగు వీరనారీమణులు ఆంధ్రావనికి చేకూర్చిన పేరుప్రతిష్ఠలను ఉగ్గడించుచు ఆమెగారు కేసరిగారి త్యాగమునుగూడ ప్రశంసించిరి. తర్వాత వేదునూరి గంగాధరముగారు తన "పసిడిపలుకులు" అను గ్రంథమునుండి కొన్ని జానపదగేయములను గానము చేసిరి.

ప్రధానోపాధ్యాయుల స్వాగతముతో ప్రారంభమైన సమావేశము తెలుగు పండితులు శ్రీ శ్రీనివాసులు నాయుడుగారి వందనసమర్పణముతోను, జాతీయగీతాగానముతోను సమాప్తియైనది.

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-.

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



ఈ నా పలుకులు ఈ తరమువారు నమ్మజాలరు. వారి జీవితమే యొక ప్రయాసగ నున్నది. ఎందుకన, స్త్రీలు, పురుషులు కూడ తమతమ ఉద్యోగములకు, వ్యాపారములకు ఉదయం 9 గంటలలోగా వెళ్ళి చేరవలసియున్నది. వారు గడియారములకు బానిసలై యున్నారు. ఉడికీఉడకని అన్నమును ఆతురతతో పొట్టనేసుకొని, తమ రైలుబండియో, మోటారు బస్సో తమకు దొరకుట సంశయించుచు, పరుగుపరుగున గంతులు వేయుచుందురు. మధ్యాహ్న భోజన కాలమున ఆఫీసునందలి గడిబిడి, అంగడియందు అల్లరి. రాత్రిభోజనమునకై కూర్చుండగా, రేపేమి జరుగనున్నదో యను చింత, నిన్నటి దినమున కలిగిన పరాభవములు, నేడు జరుగుచుండు దుఃఖములు తీరని వేదన కలిగించుచున్నవి. అయినను, ఒకపర్వదినము కలిగినపుడు, దీపావళి, క్రిస్టమస్ పండుగ వచ్చినచో లేక ఒకరి జన్మదినముననో, నేను తెలిపిన మాటలందలి సత్యము తెలియగలదు.

నేను, నాయొక్క సాకుడుకుక్కతోడ బయలుదేరి, తాజ్మహల్ నకో లేక మధుర మీనాక్షి దేవాలయమునకో వెళ్ళినపుడు, మా ఇరువురి కండ్లకు కనబడు విషయరాశి లోకేరీతియుండును. అయినను, మేము చూచు విషయములపట్ల మేమిరువుర ఎట్టి ప్రతిఘాతముల పొందుచున్నామో చింతించదగియున్నది. కుక్కకు ప్రాణసంకటముగ నున్నది. యజమానునికి బ్రహ్మానందముగ నున్నది. కుక్కకు మండపములు మాత్రమగుపడుచున్నవి. విచ్చలవిడి ఎగురుచుండుటకు ఆశించును. యజమానుడు ఆలోచించుచున్నాడు. వేలాది జనులు చెమటలుకార్చి, రాతి చిత్రముల నిర్మించియున్నారు. రాతి పలకలకు మెరుగుపెట్టి భవనముల నిర్మించియున్నారు. వీటిని చూచి సంతాపము కలుగుచున్నది. యజమాని యొక చురుకైన కమ్యూనిస్టుగ నుండినచో, "నరద్రోహియగు చక్రవర్తి, జనుల బానిసలగజేసి, తన స్వాభిమాన గౌరవ ప్రతిష్ఠలకొరకు, ఇట్టి రాతిభవనముల స్థాపించియున్నాడు" అనగలడు. అదేదృశ్యము, టాగూరువంటి కవిసార్వభౌముడు చూడగలిగినచో, అతని మనసుకరగి, "ఆహా! శాశ్వత పరబ్రహ్మము యొక్క ముఖమున యిదొక అశ్రుకణముగ నున్నది గదా!" అనక తప్పదు. ఈవిధముగ, మానవనిర్మాణ సౌందర్యములవలన, జ్ఞానేంద్రియములు అతిసూక్ష్మ సుఖానుభవములను పొందగలిగియున్నవి. కనుక, మానవరూపమును, (ఇంద్రియ శక్తులగు) దేవతలకు చూపగా, తమ అనుమోదమును, సంతృప్తిని తెలిపినవి.

ఒక గాయకశిఖామణి, ఒక వాయిద్యముల దుకాణమును ప్రవేశించి అనేక వాయిద్యములను పరీక్షించును. చక్కగలేవని అనేకమును నిరాకరించును. చక్కని స్వరము, ప్రతిధ్వనించగల వాయిద్యమును పరీక్షించినతోడనే, "సుకృతం - చాల బాగుగ నిర్మింపబడినది. చక్కగ తయారుచేయబడినది" అని కేకలువేయును. అదేవిధముగ, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, గోరూపమును, అశ్వరూపమును, నిరాకరించి, మానవరూపమును మెచ్చుకొనెను.

జీవరాశియందు ఉన్నత, పరిపూర్ణ వికాసము పొందియుండునది, మానవశరీర నిర్మాణమొక్కటే. దానికిమించి, అంగనిర్మాణమందు వికాసము కలుగగల అవకాశములేదని, అతిచిరకాలము క్రిందట డార్విన్ మహాశయుడు చేసిన ప్రకటనయందు ఈ సత్యము బలపరుపబడుచున్నది.

సృష్టికర్త, ప్రభువు, ఇంద్రియ శక్తులు కనపరచిన సంతృప్తికి ఆనందించి, మానవశరీర అంగాంగములందు ప్రవేశించి, మీమీ స్థానముల చేరుకొని సుఖింపుడని అనుజ్ఞయొసగెను.

శ్రు॥ అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశ
ద్వాయుః ప్రాణో భూత్వా నాసికే
ప్రావిశ దాదిత్య శ్చక్షు ర్భూత్వా
క్షిణీ ప్రావిశ ద్దిశః శ్రోత్రం భూత్వా
కర్ణౌ ప్రావిశ న్నోషధి వనస్పతయో

లోమాని భూత్వా త్వచం ప్రావిశం
శ్చన్ద్రమా మనో భూత్వా హృదయం
ప్రావిశ న్మృత్యు రపానో భూత్వా
నాభిం ప్రావిశ దాపో రేతో భూత్వా
శిశ్నం ప్రావిశన్॥ (4).

[అపుడు, అగ్ని, వాక్కు రూపమున ముఖమును ప్రవేశించెను. వాయువు ప్రాణరూపమున నాసికలు ప్రవేశించెను. సూర్యుడు దృష్టిరూపమున నేత్రములు ప్రవేశించెను. దిశలు శబ్దరూపమున చెవులు ప్రవేశించెను. ఓషధి వనస్పతుల దేవతలు రోమముల రూపమున చర్మము ప్రవేశించెను. చంద్రుడు మనసు రూపమున హృదయమును ప్రవేశించెను. మృత్యువు అపానరూపమున నాభిని ప్రవేశించెను. జలదేవత రేతసురూపమున శిశ్నమును ప్రవేశించెను.]

సృష్టికర్త విరాట్పురుషుని రూపము జలమునుండి పైకితీసెను. అనగా సమిష్టి జీవరాసుల రూపమేర్పడెను. వాటియందు ఇంద్రియశక్తులు (దేవతలు) ఏర్పడెను. దేవతలనుభవములు పొందుటకు తగు నిలయములు అవసరమాయెను. మానవరూపమును సృష్టించి, అందుగల ఇంద్రియస్థానముల నాక్రమించ మని వాటికి ప్రభువు ఆజ్ఞాపించెను. అవియెల్ల వాటి వాటి స్థానముల చేరెను. వాటికి క్షుత్పిపాసలేర్పడెను. అనగా, అవి అనుభవించుటకు తమకన్న అన్యముగ నుండు విషయముల కోరెను. విరాట్పురుషుని ఏకత్వమున భంగముకలిగి, అనేకరూపము లేర్పడవలసి వచ్చెను. అందువలన బహురూపములుగల ప్రపంచము కలిగెను. క్షుత్పిపాసలు తీరుటకు, ఇంద్రియములు తమ అంగములనే భుజించజాలవు. అన్యముగనుండు విషయములను భుజించి, క్షుత్పిపాసలు తీర్చుకొనవలెను. విరాట్పురుషునియందు క్షుత్పిపాసలు కలిగెను. అనగా, సర్వజీవరాసులకు కలిగెనని భావము. వ్యష్టియందు విరాట్పురుషుని వ్యవహారములు జరుగుచున్నవి. ఆ విరాట్పురుషుని శక్తి, సూక్ష్మదృష్టి, సామర్థ్యము, వ్యష్టియందు కనబడుచున్నవి.

శ్రు॥ త మశనాయా పిపాసే అబ్రూతా
మావాభ్యా మభిప్రజానీ హీ తి, తే
అబ్రవీ దేతాస్వేవ వాం దేవతా స్వా
భజా మ్యేతాసు భాగిన్యౌ కరో
మీతి. తస్మా ద్యస్యై కస్యై చ
దేవతాయై హవిర్గృహ్యతే భాగిన్యా
వేవాస్యా మశనాయా పిపాసే
భవతః॥ (5).

[క్షుత్పిపాసలు, "మా ఇరువురికి నిలయము కలిగించుము" అని అతనితో తెల్పుకొనెను, అతడు, "మీరిరువురికి, ఈ దేవతలతోపాటు నిలయమిచ్చుచున్నాను. వారితోకూడ మీరు భాగస్థులగుదురు గాక." అందువలన ఒక దేవత కొసగిన ఆహుతులకు క్షుత్పిపాసలుకూడ భాగస్థులైరి.]

సృష్టికర్త ఆజ్ఞానుసారము, దేవతలు (వ్యవహారశక్తులు) స్థూలశరీరమున తమతమ నిలయములు ప్రవేశింపగా, క్షుత్పిపాసలు, తామెచ్చట చేరవలెనో తెలియని దోషమువలన, వెనుక నిలిచి, సృష్టికర్తను విచారించినవి. మేమెచ్చట చేరవలెను? మాకు నిలయము చూపుము అనెను. ఇదంతయు కవిత్వచమత్కారముతో, నాటకమువలె ఋషి తెలుపుచున్నాడు.

దేహమునందు వ్యవహార కేంద్రములు నిండిపోయెను. దేహమున మరికొన్ని కేంద్రములు సృష్టించుటకు వీలులేదు. క్షుత్పిపాసలకు నిలయము కావలెను. కనుక "మీరు అన్ని కేంద్రముల సుఖమునకు భాగస్థులగుదురు గాక. విషయేంద్రియములలో దేనియందు సంతృప్తికలిగినను, మీకు తృప్తి కలుగగలదు" అని అతడు తెలిపెను. ఈ భావమును గ్రహించుట కిందలి కవితాచాతుర్యమును విశదీకరించవలెను. అంతరమునుండి ప్రేరేపణజేయు తీవ్రశక్తి యొకటి లేకున్నచో మానవునియందు గల ఏ విషయేంద్రియముగాని ప్రకాశించుటకు ఆతురబడదు. అభివృద్ధి గాంచదు. అట్టి ప్రేరేపణ, క్షుత్పిపాసలవల్ల కలుగుచున్నది.

ఒక ధనవంతుని కుమారుడు విద్యావిహీనుడుగ నుండును. ఒక బీదవాని కుమారుడు విద్యయందు నిపుణుడగుచున్నాడు. ప్రపంచజీవితమున సుఖముగ బ్రతుకుటకు తాను కష్టపడవలెనను తీవ్రఆక్రోశమతనికి ప్రేరేపణశక్తి నొసగుచున్నది — అటులనే — మంచిరూపములు చూడవలెనని నేత్రములకు క్షుత్పిపాసలున్నవి. మధురగానము వినవలెనని చెవులకు క్షుత్పిపాసలున్నవి. మంచిరుచుల నాస్వాదించవలెనని, జిహ్వకు క్షుత్పిపాస కలదు. ఇట్టి క్షుత్పిపాసలు వాటికి లేకున్నచో, అవి ఎట్టి వ్యవహారములు చేయక, స్థాణువులవలె యుండగలవు.

నేటికాలమున, స్త్రీలుకూడ తమ చేతిబిడ్డలను వదలుకొని, ఉద్యోగములుచేసి, కుటుంబ ఆదాయమును వృద్ధిచేయనెంచియున్నారు. ఎందుకని? సొగసైన బట్టలను ధరించుటకు, సినిమాలను చూచుటకు - తమ స్పర్శేంద్రియముల, నేత్రేంద్రియముల క్షుత్పిపాసలు తీర్చుటకు - మంచిరేడియోలను పొంది, తమ శ్రవణేంద్రియముల క్షుత్పిపాసల తీర్చుకొనుటకు, మంచి రుచిగల ఆహారమును భుజించి తమ జిహ్వేంద్రియముయొక్క క్షుత్పిపాసల తీర్చుకొనుటకు - పురుషులతోపాటు పోరాడుచున్నారు.

అనగా, నేటిప్రపంచమున, విచక్షణలేక, నియమములేక, ప్రతియొక్క విషయేంద్రియము తమ క్షుత్పిపాసలను హద్దునందుంచుకొనక, రేగిపోయినవి. అన్ని విషయేంద్రియములు ఉద్రేకము పొందియున్నవి. దేహమునందెట్టి అల్లకల్లోలములు కలుగుచున్నవో, సమాజమున వివిధవ్యక్తుల దినచర్యలవలన తెలియుచున్నది.

విషయేంద్రియములు సుఖమపేక్షించి, తాముకోరు విషయముల పొందుటకు ఆశించినచో, అట్టి ప్రేరేపణయే ఇంద్రియముల క్షుత్పిపాసయనియు, ఆ యింద్రియముపొందు తృప్తికి అనుగుణముగ, "క్షుత్పిపాసలు" కూడ తృప్తిపొందుచున్నవను భావమును గురువు బోధించుచున్నాడు.

## 4 భాగము.

### ప్రథమాధ్యాయము - తృతీయఖండము.

ఈ ఖండమునందు, విషయరాసులనుండి అన్నమెట్లు సృష్టింపబడెనో, తెలుపబడుచున్నది. సృష్టించబడిన అన్నము, భోక్తయొక్క విషయేంద్రియముల బారినుండి, వాటి వ్యవహారశక్తులకు అందక, పరుగిడిపోయెను. అపానము మాత్రము ఆహారమును వశపరచుకొని, లోపల నిలుపుకొనగలిగెను. ఒక ఇంద్రియ విషయమును, దానికనుగుణమగు ఇంద్రియమువలన అనుభవింపవలసియున్నది. మిగత ఇంద్రియములు ఆ విషయమును అనుభవింపజాలవు. ఒక చిత్రమునగల వర్ణములను, నేత్రములు మాత్రము అనుభవించగలవు. చెవులు వర్ణములను విని అనుభవించజాలవు. నాసిక వర్ణముల నాఘ్రాణించజాలదు. నాలుక వర్ణములను రుచి చూడజాలదు. చర్మము వర్ణములను స్పర్శింపజాలదు.

ఈ మూడవ ఖండమున, పురుషరూప శరీరమున, ఆత్మ విచిత్రముగ ప్రవేశించుట తెలుపబడుచున్నది. శరీరమున ఆత్మ పొందిన అనుభవముల వర్ణన కలదు. కనుక ఐతరేయోపనిషత్తునకు ఈ ఖండము ప్రాణమువంటిది. ఇది ఉపనిషత్తునందు మధ్య అమరియున్నది. దీనికి పూర్వము శాంతిపాఠముతో రెండు ఖండములున్నవి. దీనికి వెనుక రెండు ఖండములు, శాంతిపాఠమున్నది. కనుక ఐతరేయోపనిషత్తునకిది కేంద్రమనవచ్చును.

ఈ ఖండమునగల ఉపమానములు పిల్లలాటవలె, హాస్యాస్పదముగ నున్నవని, భ్రమకలిగించునవియని, కొందరు భాష్యకారులు తలచియున్నారు. ఋషులు, బోధనాశైలియందు, భావములందు, సామాన్యాంతస్థుకు దిగివచ్చినపుడు, వాక్యములు పసిబాలుర భావవలె నుండును. గాని, అంతరార్థము గొప్పదిగ నుండును. జ్ఞానపెన్నిధివలె, వాటి లక్ష్యార్థముండును. అతి అగాధమగు సముద్రములు, ఉపరిభాగమున ప్రశాంతముగనుండును.

శ్రు॥ స ఈక్షతే మే ను లోకాశ్చ లోక
పాలాశ్చాన్నమేభ్య సృజా
ఇతి.॥ (1)

[ఈశ్వరుడు "ఇవి గోలోకములు, లోకపాలకులు. ఇపుడు వారికి అన్నమును సృజించెదనుగాక" అని తలచెను.]

విషయేంద్రియములు సృష్టింపబడెను. ఇంద్రియశక్తులు - దేవతలు సృష్టింపబడెను. ఇంద్రియ విషయములను సృష్టింపవలసియున్నది. వాటివలన ఇంద్రియముల క్షుత్పిపాసలు తీరగలవు. ప్రతి ఇంద్రియముయొక్క క్షుత్పిపాసను తీర్చు ఇంద్రియ విషయము ప్రత్యేకముగనున్నది. అయినను, ఇంద్రియములకు వ్యవహారశక్తి అన్నరసమువలననే కలుగుచున్నది. కనుక అన్నము, అనగ, ఇచట ఇంద్రియ విషయములనియు, భుజింపబడు అన్నమనియు కూడ భావింపవలసియున్నది.

శ్రు॥ సో౽పో౽భ్యతపత్తాభ్యో౽భిత
ప్తాభ్యో మూర్తిరజాయత. యా వై
సా మూర్తిరజాయతాన్నం వై
తత్.॥ (2).

[అతడు జలమునుగూర్చి తపస్సుచేసెను. అట్లు

తపస్సు చేయబడిన జలమునుండి ఒక విషయాకార ముద్భవించెను. అట్లుద్భవించిన రూపమే అన్నము.

పూర్వము — ప్రభువు జలములగూర్చి తపము చేయగా, విరాట్పురుషుని రూపము కలిగెను. అదే విధముగ, మరల జలములనుగూర్చి తపముచేసెను. ఇచట జలమనగ, పంచభూతములలో నొకటని సూచింపబడినది. దానివలన పంచభూతములను గూర్చి అతడు తపముచేసెనని భావము. తత్ఫలితముగ ఒక విషయాకారము కలిగెను. "అతడు జలములగూర్చి తపముచేసెను. అందొక రూపము కలిగెను. ఆ విషయ రూప మన్నమాయెను" అనుటవలన, అన్నమును నిర్వచించి నట్లగుచున్నది. ప్రపంచమున, అన్నము జలములందు పుట్టి, జలమునందు అస్తిత్వముపొంది, జలమువలన వృద్ధిపొందుచున్నది. జలమే ఆధారముగ గలిగియున్నది. అట్టివిషయములు అన్నమనబడును. మరియు, అన్నము మ్రింగుటకు, జీర్ణకోశమున యుండుటకు, జీర్ణమగుటకు, జలము మధ్యవర్తిగ నున్నది. ఆహారపదార్థమున, జలము లోపించినయెడల, ఆ పదార్థము శరీరావయవముల పోషింపజాలదు. ఈ విషయము మనుష్యులందు, మృగములందే కాక, వృక్షజాతియందుకూడ నిదర్శనముగ తెలియుచున్నది. ఒక విత్తనము నీటియందు నానుటవలన, దానినుండి మొలకపుట్టును. నీటివలన గింజయందలి గంజిపదార్థము పోషకపదార్థముగ మారి మొలక వృద్ధియగుటకు సహాయపడుచున్నది. చెట్టుపెరిగిన వెనుకకూడ, నీరు మధ్యవర్తిగ యుండుటవలన, చెట్టు ఆహారమును పీల్చుకొని రక్షించుకొనుచున్నది.

కాయగూరలు, ఆకుకూరలు, దుంపలు మొదలగునవి నీటియందు ఉడుకపెట్టుటవలన మెత్తబడే, రుచికర ఆహారముగ శాకాహారులకు లభించుచున్నది. ఇతరులకు కూడ మాంసాది పదార్థములను నీటియందుడకపెట్టవలసియున్నది. అందువలన జలాంశము తొలగించబడిన డబ్బాపాడులు, గుళికలు ఆహార పదార్థములు కావని నిర్ణయమగుచున్నది. అవి అనివార్యముగ భుజించవలసినచో, వాటితోపాటు నీరునుచేర్చి భుజంచవలసియున్నది. అటుగాకున్న, అవి మన జీర్ణకోశములోని నీటిని పీల్చుకొని జీర్ణము పొందవలెను. సముద్రపుటొడ్డునగల ఇసుకను, రాళ్ళను, కొండగుల్లలను భుజించి జీవించుప్రాణి ఒకటి కూడా లేదు. జలమనగా, పంచభూతముల నూహింపవలెననుట నిరాకరించినను, జలమునుండి అన్నముత్పన్నమాయెననుట మాత్రము స్పష్టమగుచున్నది.

శ్రు॥ త దేన త్సృష్టం పరాఙత్యజిఘాంస
త్తద్వా చా జిఘృక్ష త్తన్నాశక్నో
ద్వాచా గ్రహీతుమ్. యద్ధైన ద్వాచా
గ్రహైష్య దభివ్యాహృత్య హై
వాన్న మత్రప్స్యత్ ॥ (3).

[ఈవిధముగ సృష్టింపబడిన అన్నము అపుడు పారిపోవజూచెను. పురుషుడు (తొలుత సృష్టింపబడిన విరాట్పురుషుడు) దానిని వాక్కుతో పట్టుకొన యత్నించెను. వాక్కుతో అతడు దానిని పట్టుకొనజాలకపోయెను. అతడు వాక్కుతో అన్నమును గ్రహించగలిగియుండినచో, మనమిపుడు అన్నమును గూర్చి మాట్లాడుటతో తృప్తినివారణ పొందగలిగి యుందుము.]

శ్రు॥ త త్ప్రాణే నాజిఘృక్ష త్తన్నాశక్నో
త్ప్రాణేన గ్రహీతుమ్. స యద్ధైన
త్ప్రాణే నా గ్రహైష్య దభిప్రాప్య
హై వాన్న మత్రప్స్యత్ ॥ (4).

[అతడు యూపిరి పీల్చుటవలన దానిని పట్టుకొన ప్రయత్నించెను. అతడాఘ్రాణించుటవలన దానిని స్వాధీనము చేసుకొనలేకపోయెను. అతడు ఘ్రాణము వలన దానిని పట్టుకొనగలిగి యుండినచో, మనము ఆహారము నాఘ్రాణించుటవలననే, తృప్తిపొందగలిగి యుందుము.]

శ్రు॥ త చ్చక్షుషా జిఘృక్ష త్తన్నాశక్నో
చ్చక్షుషా గ్రహీతుం. సయద్ధైన
చ్చక్షుషా గ్రహైష్యద్ దృష్ట్వా
హైవాన్నమత్రప్స్యత్ ॥ (5).

[అతడు దానిని నేత్రములతో గ్రహించనెంచెను. నేత్రముద్వారా దానిని తినలేకపోయెను. అతడు నేత్రములద్వారా దానిని గ్రహించియుండినచో, మనము అన్నమును చూచుటవలననే తృప్తిపొందగలిగి యుందుము.]

(సశేషము)

# ముందు - వెనుక

శ్రీ భమిడిపాటి అనంతకృష్ణమూర్తి



గుంటూరు పోలీసు స్టేషనులో అతినిశ్శబ్దం ఆవరించియున్నది. బైట వరండాలో గస్తీపోలీసు బూట్ల చప్పుడు, లోపల పంకా తిరుగుతున్న చప్పుడు తప్ప మిగతా అంతా నిశ్శబ్దం. క్రొత్తగా ఛార్జి పుచ్చుకున్న వేణు ఆఫీసుఫైల్సు ఒకదానివెంట మరొకటి తిరగవేస్తున్నాడు. కానిస్టేబిలు చూచిన ఫైళ్ళను తీసికొనివెళ్ళి యథాస్థానమున సర్దుతున్నాడు. ఉన్నట్లుండి వేణు దృష్టి ఒక ఫైలుమీద నిలిచిపోయింది. దానిమీద 'ఇజాక్' అని యున్నది. ఆ పేరు చూడగానే వేణు షాక్ తిన్నవానిలాగ కుర్చీలో చేరగిలబడ్డాడు. దీన్ని గమనించిన కానిస్టేబిలు "అది 'ఇజాక్' అనే దొంగలముఠా నాయకునిదండీ! రెండు మూడుసార్లు పట్టుకుందామని దాడిచేశాము కాని తప్పించుకు పారిపోయాడు. కొంచం గట్టి ఘటం..." అంటూ నీళ్లు నమిలాడు. వేణు ఆ ఫైలును ఆమూలాగ్రంగా చదివాడు. ఏదో ఆదుర్దాగా వెతుకుతున్నట్లు జేబుదొంగల ఫొటోలను ఒక్కసారి పరిశీలించాడు. చివరకు ఒక్క నిట్టూర్పు విడిచి ఆ ఫైలు మూసి కానిస్టేబిలుకు అందించాడు. కుర్చీలో వెనక్కు జారగిలబడి నుదుటిమీద విపరీతంగా పట్టిన చెమటను తుడుచుకుంటూ ఫంకావంక చూడసాగాడు.

రోజులు దొర్లిపోతున్నవి. ఎవరి పనులు వారు చేసుకపోతున్నారు. గడియారం ఒకదాని తరువాత మరొక అంకెను చూపిస్తూ గమ్యస్థానం లేనిదానిలాగ సాగిపోతున్నది. వేణు మాత్రం పట్టుదలగా పని చేస్తున్నాడు. కనీసం రోజుకొక సారైనా 'ఇజాక్' ఫైలు చూస్తుండేవాడు. చూచినప్పుడల్లా అతని ముఖంపై బాధాచిహ్నాలు కనుపించేవి. వానితోబాటు నిట్టూర్చడం జరుగడం పరిపాటయింది.

ఆనాడాదివారం. అయినా ఒకసారి ఆఫీసుఫైల్సు చూచిపోదామని వేణు వచ్చాడు. ఇంతలో టెలిఫోను గంట మ్రోగింది. ఫోను రిసీవు చేసికొని తన ఐడెంటిటీ చెప్పాడు. అటువారు ఎవరో, ఏమి చెప్పారోకాని వెంటనే పోలీసును పిలచి దాడి జరుపడానికి వాన్‌ను సిద్ధం చెయ్యమని, ఒకసారి తన పిస్తలులో గుళ్లు పరీక్షించి బైలుదేరాడు. వాన్ బయలుదేరినవైపే చూస్తూ మిగిలియున్న పోలీసులు "ఇదివరకెన్ని ఆకస్మికదాడులు జరుపలేదు! యిదీ అంతేలే..." అని గుసగుసలాడసాగారు కొందరు. ఒకడు "కొమ్ములు తిరిగినవారే ఏమి చేయలేకపోయారు" అన్నాడు నిస్సారంగా.

రెండుగంటలకల్లా వెళ్ళిన వాన్ తిరిగివచ్చింది. వాన్‌లోనుండి దిగినవారి వదనాల్లో నిరుత్సాహం, నిస్పృహా, అలసట కనిపించినాయి. వేణు వాన్‌నుండి దిగకుండా అందులోనే యింటికి వెళ్ళాడు.

వేణు రాత్రింబగళ్లు 'ఇజాక్'ను గురించే ఆలోచనలు. చూడబోతే మంచి తెలివితేటలుగల వ్యక్తి అనిపించాడు. కాని మరి యిలా ఎందుకు మారాడో! ఒక్కొక్కప్పుడు ఆలోచనలతో చలించిపోయేవాడు వేణు.

ఒకరోజున ఏమితోచక సాయంకాలం సినిమాకు బయలుదేరాడు. వెంట మారుదుస్తులలో కానిస్టేబిలు కూడ నున్నాడు. థియేటరు ముందు సిగరెట్టు వెలిగించి దారిన వచ్చేపోయేవారిని చూస్తూ నిలబడ్డాడు. కానిస్టేబిలు టికెట్టు కొనడానికి వెళ్ళాడు. ఇంతమంది ఇన్‌స్పెక్టర్ల కండ్లలో దుమ్ముకొట్టి గతంలో తప్పించుకు తిరుగుతున్న ఇజాక్‌ను తనైనా పట్టుకోగలుగుతానో లేదోయనే వేణు ఆలోచన. ఆకస్మికంగా దారినపోయే వ్యక్తిమీద అతని దృష్టిపడి వెంటనే వేణు ముందువెనుకలు చూడకుండా 'ఇజాక్' అని ఎలుగెత్తి కేకవేసి ముందుకడుగేశాడు. ఆ కేక విన్నవ్యక్తి పారిపోవసాగాడు. అప్పుడే తిరిగి వస్తున్న కానిస్టేబిలు అతని వెంటబడ్డాడు. ఎక్కువ శ్రమలేకుండానే పట్టుబడ్డాడు ఇజాక్. రెక్కలు విరిచి పట్టుకొని అతనిని వేణు దగ్గరకు లాక్కొచ్చాడు కానిస్టేబిలు సగర్వంగా. వేణు అతని ముఖం పారజూస్తూ "నీవేనా ఇజాక్" అన్నాడు ప్రజ్వలించే నేత్రాలతో.

కానిస్టేబిలు యమకింకరుడులాగ "దొంగవెధవ! ఎంతకాలం యిలా తప్పించుకొని తిరుగుదామను

(620వ-పేజీ చూడుడు)

# కన్నీటి కెరటాలు

శ్రీమతి పతానేని శ్రీశైలభ్రమరాంబ

ఆకాశమంతటా దట్టమైన మబ్బులతో నిండిపోయి క్షణాలమీద నల్లని ముసుగు కప్పుకుంది. ప్రళయకాల జంఝామారుతంలా తీవ్రప్రభంజనం ప్రారంభమైంది. భూమ్యాకాశాలు దద్దరిల్లేలా ఘోషిస్తూ "ఫెళఫెళ" మంటూ ఘర్జనలుకూడా ప్రారంభించాయి మేఘాలు. తళుక్కు తళుక్కుమంటూ తటిల్లతలు ఆకాశాన్ని చీల్చుకుని కళ్లు మిరుమిట్లుగొల్పే కాంతితో కత్తుల్లా ఝుళిపించి క్షణాల మీద మాయమైపోతున్నాయి.

కొద్దిసేపట్లోనే చిటపటమంటూ చినుకులు ప్రారంభమయ్యాయి. వరుణదేవుని ఆక్రోశంతో ఒక్క క్షణకాలంలో ప్రకృతి అంతా ప్రళయభీకరంగా మారిపోయింది. చిటపటచినుకులతో ప్రారంభమైన చిరుచినుకులు దివినుంచి భువివరకూ ఒకేగొలుసులా ఏనుగుతొండం ధారగా మారిపోయింది.

తళుక్కుమంటూ ఒక్క మెరుపు మెరిసి ఆ వెను వెంటనే దిగంతాలు ప్రతిధ్వనించేలా ఒక్క పెద్ద ఉరుము ఉరిమి దానితోబాటే కఠోరమైన శబ్దంతో ఒక్క పిడుగు పడింది.

"బాబూ" అంటూ కొడుకుని గుండెలకు అదిమి పట్టుకుంది విశాలాక్షి. "అమ్మా" అంటూ తల్లి పీకకు చేతులుచుట్టేసి బావురుమన్నాడు కొడుకు మురళి. అయినా ఆ భయకంపిత శబ్దానికి తల్లీ కొడుకూ కూడా నేలమీద కూలబడిపోయారు.

మళ్ళీ కొద్దిక్షణాలకే విశాలాక్షి తేరుకొని లేచి నిల్చుంది. మురళినికూడా లేవదీసి నిల్చోబెట్టి దగ్గరగా తీసుకుంది. ఆ పిడుగు తన నెత్తినబడితే తన బిడ్డగతి యేమయ్యేది? తన బిడ్డమీదపడితే తన బ్రతుకంతా కన్నీటికెరటాల్లో మునిగిపోవలసివచ్చేది. ఆకాశదేవత కరుణించింది కాబట్టి తనకీ బిడ్డకీ ఏ అపాయమూలేకుండా గడచిందని భగవంతునికి మనసారా నమస్కరించింది విశాలాక్షి.

కొడుకూ తనూ క్రిందపడ్డప్పుడు ఒళ్ళంతా బురద అంటుకొంది. ఆ బురద కడుక్కోవాలన్నా ఎక్కడా నీళ్లుకూడా కన్పించలేదు. తన పైటకొంగుతో మురళి వంటినున్న బురద తుడిచి చంకను ఎత్తుకుంది. మురళికి ఆ అర్ధరాత్రివరకూ నడిచేందుకు శక్తిచాలదు. కొడుకుని ఎత్తుకుందామంటే ఏడు సంవత్సరాల బాలుడు అవడంచేత తను మురళిని ఎత్తుకుని నడవలేదు. అయినా పిడుగుయొక్క భయంకర శబ్దానికి మురళి ఝడుసుకున్నాడేమో అన్న భయంచేత లేని సత్తువను తెచ్చుకుని కొడుకుని భుజంమీద పడుకోబెట్టుకుని ఎడమచేత్తో గట్టిగా వానిని అదిమిపట్టి కుడిచేత్తో చిన్న చేతిసంచీని పట్టుకుని మళ్లీ నడక సాగించింది విశాలాక్షి.

విశాలాక్షి కొడుకుతోసహా కోటిపల్లిరేవు దాటేసరికి నీరెండలున్నాయి. ఆఖరిబస్సు అందుతుందనుకొంది. కాని తీరా నావదిగి బస్సు దగ్గరకు వచ్చేసరికి క్షణంలో బస్సు దాటిపోయింది. తను వెళ్ళవలసిన "తాణేలంక"కి బండి, రిక్షా ఏమీ వెళ్ళవు. అదొక కుగ్రామం. అయినా తను వెంటనే ఆ ఊరు వెళ్లాలి. రెట్టింపురేటు యిస్తానని ఒక సైకిల్ రిక్షా మాట్లాడుకొంది. ఊరికి మైలుదూరంలో దిగబెడ్తానన్నా అంగీకరించి మురళితోసహా రిక్షాలో కూర్చుంది విశాలాక్షి.

ఆ రోడ్డు సరిగాలేక చీకటి పడిపోవడంతో ఒక కంకరగొప్పుకు తగిలి రిక్షాటైర్ పేలిపోయింది. ఎటు వెళ్లాలన్నా మైలుదూరం పోతేనేకాని ఊరు కన్పించదు. అప్పటికి తను చేరవలసిన గమ్యస్థానానికి సగందూరంమాత్రమే వచ్చింది. నాలుగుమైళ్ళు అడ్డత్రోవనుపోతే "తాణేలంక" వస్తుందని తనకి తెల్సు. ఇంక గత్యంతరంలేక రిక్షావాలాకి అనుకొన్నట్లు డబ్బిచ్చి కొడుకుతోసహా దిగి ముందుకే నడకసాగించింది విశాలాక్షి. తీరా ఒకమైలు దూరం నడిచేసరికి వర్షం ప్రారంభమైంది.

తను యింటికి ఎంత తొందరగా వెళ్లాలని ఆశతో వస్తోందో; అంత ఆలస్యమైపోతోంది. ఎంత అర్ధరాత్రి అయినాసరే తను కొడుకుతోసహా తాణేలంక

చేరుకోవాలి. లేకపోతే తన భర్తని చిట్టచివరి రోజుల్లో కూడా చూసే అవకాశం తనకింక లభించదేమో! ఏడు సంవత్సరాలనుంచీ ఏ నామస్మరణతో జీవిస్తూందో; తన భర్తకి ఎప్పటికైనా తనపై అనుగ్రహం కల్గి తనకు దర్శనమిక్కకపోతాడా అనుకొంటూ కన్నీటి కెరటాల్లో ఏడు వసంతాలు ఏడుయుగాల్లా గడిపిన తనకు, తనభర్త చివరిక్షణాల్లో వున్నట్లు కఠోరవార్తనిచ్చే టెలిగ్రాం అందింది. తక్షణం కొడుకుని వెంటబెట్టుకు ప్రయాణమైంది. ఒక్కసారైనా కడసారిగా తనభర్త నోటినుంచి చల్లని మాటనైనా వినబడుతుందా? తననీ బిడ్డనీ కళ్ళారా చూస్తాడా? అనుకొంటూ ఏడ్పును పైకి విన్పించనీయకుండా అంతర్యంలో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతూంటే ఆవేశంతో కొడుకుని ఎత్తుకునే నడక సాగిస్తోంది విశాలాక్షి. ధారాపాతంలా పడుతూన్న వర్షాన్నిసైతం లెక్కచెయ్యక, చలికి నరాలు బిగుసుకుపోతున్నా, ఎముకలు కొరికేస్తున్నా భుజంమీద కొడుకుని పడుకోబెట్టుకున్న భారాన్నికూడా తల్చకోక యంత్రంలా నడిచిపోతూనేవుంది విశాలాక్షి.

చాలాదూరం సాగిపోయాక భుజంమీదనున్న మురళికి మెలకువ వచ్చింది. తన తల్లి కష్టాలు తన ఊహకి అందకపోయినా వర్తమానంలో తనని ఎత్తుకు నడవలేదని గుర్తించిన మురళి, "అమ్మా! నేను నడుస్తా" అని క్రిందికి దిగాడు.

కొబ్బరితోట దగ్గరకు వచ్చారు. ఆ తోట సుమారు నాల్గు ఫర్లాంగుల వైశాల్యంగల తోట. పేరుకు మాత్రమే కొబ్బరితోటకాని ఆ తోటంతా మామిడి, చింత, కుంకుడు, పనస, నారింజ, బత్తాయి రకరకాల పెద్ద వృక్షాలతో నిండివుంటుంది. ఆ తోటంతా తమ ఊరి పెద్దమున్సబుగారిదని తనకి తెల్సు. ఆ అర్ధరాత్రి సమయంలో ఆ తోటలో నుంచి నడచి వెళ్ళాలంటే గుండెధైర్యంగల మానవులే హడలిపోతారు. ఆ తోట దాటితేగాని ఊళ్ళోకి వెళ్ళలేరు. వర్షపుజోరు కొంచెం తగ్గినా ఆకాశంమీద మాత్రం నల్లముసుగు విడలేదు. తోటలో గల చెట్లన్నీ తలలు విరియబోసుకున్న దెయ్యాల్లా మహాభీతిని కల్గిస్తున్నాయి. ఆ తోట దాటి ఊళ్ళోకి వెళ్ళేసరికి తనకెట్టి దారుణవార్త విన్పిస్తుందో! తన భర్తని ఏ స్థితిలోవుండగా చూడాల్సివస్తుందో! తన భర్తకు చాలా సీరియస్‌గా వుందనీ, తక్షణం వస్తే చూపుదొరుకుతుందనీ వచ్చిన టెలిగ్రాం తల్చుకునేసరికి గుండెలు గుభేలుమంటున్నాయి విశాలాక్షికి. తనభర్త సురక్షితంగా వుండాలనీ, తన ముత్తయిదువతనం సుస్థిరంగా వుండేటట్లు అనుగ్రహించమని జగదీశ్వరిని మనస్సులో వేడుకుంటూ ఆ భయంకరమైన తోటలో నడక సాగిస్తోంది విశాలాక్షి.

తోటదాటి ఊళ్లోకి వచ్చేసరికి చుట్టూ పెద్ద ప్రహరీలోపల ట్యుటోరియల్ స్కూలుగల ఆ ఆవరణ కంటికి కన్పించేసరికి సప్తవర్షాల క్రిందటి తన జీవితపు అధ్యాయాల పుటల్ని వెనక్కి తిరగేస్తోంది విశాలాక్షి మెదడు.

తనభర్త సుందర్రావు, యం. ఎ. పట్టా పట్టుకుని పైసాకట్నం తీసుకోకుండా తనని అర్ధాంగిగా స్వీకరించాడు. అందరిలా తనూ ఒక ఉద్యోగం చేసుకుంటూ జీవయాత్ర చెయ్యడానికి ఇష్టంలేక ఒక మాస్టరుగా మారాడు. భావిభారతపౌరులుగా తయారయ్యే బాలలు వీరేననీ, తను చెప్పేదే పునాది అవుతుందనీ ఎంతోబాగా పసిపాపల గుండెల్లోకూడా హత్తుకునేలా పాఠాలు చెప్పేవాడు సుందర్రావు. ఒక్కసంవత్సరంలో తన విద్యార్థుల సంఖ్య వందలు దాటింది. చిన్న ప్రయివేటుస్కూలు పెట్టాడు. అయినా అన్నిక్లాసుల విద్యార్థులకీ తనొక్కడివల్ల విద్య పరిపూర్ణం అయ్యేటట్లు కన్పించకపోయేసరికి ట్యుటోరియల్ స్కూలుకి తను హెడ్మాస్టరుగాను, ఇద్దరు అసిస్టెంటు టీచర్స్ని వేసుకున్నాడు. తన ఆశయాలు, విశాలభావాలు పూర్తి అయ్యేవరకూ...చివరకు తన జీవితమే భారతీయ విద్యాయువకులకోసం ధారపొయ్యాలనే వ్రతంగా మార్చుకున్నాడు సుందర్రావు.

బయట తన చిరమనోవాంఛితాల్ని నెరవేర్చే విద్యార్థులు అందరూ ఏకసంతగ్రాహులవలె ఎంతో చురుకుగలవారై ఫస్టుమార్కులతో ప్యాసై అభివృద్ధికివచ్చే తన విద్యార్థులను చూచి తనివితీరా ఆనందించేవాడు. ఇంట్లో తన అర్ధాంగి విశాలాక్షి, అందంలో దేవకన్యకలని మరపించి, సంగీతంలో తుంబుర, నారదుల్తో పోటీపడి, చదువులో శారదాదేవి వరప్రసాదమా అన్నట్లుండేది.

విశాలాక్షి నవ్వుతూ మాట్లాడుతూంటే సుందర్రావు మనస్సులో కోటిమల్లెలు విరిసినట్లుండేది. తనకింతటి సౌందర్యరాశి భార్యగా దొరికినందుకు అనిర్వచనీయమైన గర్వాన్ని, వెల్లివిరిసిపోయే ఆనందాన్ని పొందుతూ తన జీవితనావని వింతవింత ప్రశాంతకాంతుల్ని విరజిమ్ముకుంటూ రోజులు క్షణా

ల్లాగ దార్లించేసేవాడు. "విశాలా! నువ్వు నా యింటికి వచ్చాక నాకీ అదృష్టంపట్టింది. నాపాలిటి భాగ్యదేవతవు నువ్వే! నీలోని మంచి, ఓర్పు, దయ, ప్రేమ, నీయందుగల సుగుణసంపత్తే నన్ను నీ ప్రేమ దాసునిగా చేస్తున్నాయి. నువ్వు లేకపోతే నేనొక్క క్షణంగూడా జీవించలేను సుమా!" అంటూ ఎన్నో విధాల అంటూండేవాడు సుందర్రావు.

చూచేవాళ్ళంతా ఈ జంటను చూచి సీతారాములనాలో, రతీమన్మథులనుకోవాలో, చిలకాగోరింకలతో పోల్చుకోవాలో అర్థంగాక "అన్యోన్యమైన జంట", "ఆదర్శదాంపత్యం" అంటూ వేనోళ్ళ దీవించేవారు.

మూడు వసంతాలు గిర్రున తిరిగాయి. విశాలాక్షి మాతృమూర్తి అయింది. తన ఆశయాలు నెరవేర్చేందుకు కొడుకే పుట్టాలని సుందర్రావు కొండెగా దైవప్రార్థన చేస్తూంటే తనలోతనే నవ్వుకునేది. కొడుకుని తను ఎల్లా ఆదరిస్తాడో; తన కొడుకేవిధంగా పెరగాలో; తనెంత అపురూపంగా చూసుకుంటాడో అన్నీ ఊహించి అతడు చెబుతూంటే తనలోతనే తన్మయురాలయ్యేది విశాలాక్షి.

అతనికోరిక సఫలమయ్యేందుకా అన్నట్లు ఓ శుభసమయంలో పుత్రోదయమైంది. మేలిమి కాచి వడగట్టి విగ్రహంగా తయారుచేసాడా ఆ విధాత అన్నట్లుగా ఎంతో చక్కగావున్న కొడుకుని చూచి మురిసిపోయాడు సుందర్రావు. "మురళీమనోహర్" అని పేరుపెద్దామన్నారు. క్షణంతీరిక చిక్కితే తన ముద్దులకొడుకు మురళితో తనూ ఓ బాలుడైనట్లు ఆడుకొంటూండేవాడు సుందర్రావు.

స్ఫురద్రూపి, ఉత్తమ విద్యావంతుడు, ఆర్థికవసతిగల ఉపాధ్యాయవృత్తి, లలితకళోపాసి, దయా దాక్షిణ్యాలుగల ఉత్తముడైన తన భర్తతో, ఏకైక పుత్రునితో ఆనంద కెరటాల్లో దార్లించేస్తోంది విశాలాక్షి కాలాన్ని.

తెల్లవారితే అబ్బాయికి అన్నప్రాశన. సాయంత్రం స్కూలు వదలగానే పట్నంవెళ్ళి సామగ్రి తీసుకు మర్నాడు ప్రొద్దున్నే వస్తానని చెప్పి బయల్దేరివెళ్లాడు సుందర్రావు.

రాత్రి పదిగంటలకి సుందర్రావు దగ్గఱ చదువుకొన్న యువకుడు "జగన్మోహన్" తను బి. ఏ. ప్యాస్ అయినట్టు చెప్పడానికై వచ్చాడు. అతడంటే తనకీ, తన భర్తకీకూడా ఎంతో యిష్టం. మర్నాడు ప్రొద్దున్న మురళికి అన్నప్రాశన అవుతుందని, ఆగమని చెప్పడంతో జగన్మోహన్ ఆగిపోయాడు.

"బాబ! బాబ!" అంటూ తప్పటడుగులువేస్తూ మురళి జగన్మోహన్‌తో కేలింతాలుకొడ్తూ ఆడుకొంటున్నాడు.

ఆనందంతో చిందులుత్రొక్కుతూ ఆడుతోన్న మురళి గభీమని నడవబోయి ముందున్న యినపకుర్చీమీద బోర్లాపడ్డాడు. ఆ కుర్చీకొన బలంగా మురళి నుదుటిమీద గుచ్చుకొని బొటబొటా రక్తం కారింది. ఆ రక్తాన్ని కళ్లతో చూచేసరికి విశాలాక్షికి "ఫిట్" వచ్చినంతపనైంది. ఒక్కగంటలో మురళికి ఫెల్లుమంటూ జ్వరం వచ్చేసింది.

మురళికి జ్వరంతో ఒళ్లు సలసలా కాలిపోతోంటే భయంతో జగన్మోహన్, బాధతో విశాలాక్షి రాత్రంతా మేలుకునే కూర్చున్నారు. సరిగ్గా తెల్లవారుఝామునే ఇద్దరికీ కొంచెం మగతగా నిద్ర వచ్చింది.

గంటరాత్రి వుందనగా సుందర్రావు అబ్బాయికి ఎన్నో ఆటవస్తువులు, కొత్తబట్టలు తీసుకునివచ్చి తలుపుతట్టాడు. పావుగంట నిరీక్షించాడు, జవాబు రాకపోయేసరికి దబదబా బాదాడు. అయినా తలుపులు తెరవబడపోవడంతో దొడ్డితోవన తలుపు ఉతకలు ఎత్తి లోపలికి వచ్చాడు.

గదిలోకి చూస్తూ అల్లాగే స్థంభించిపోయి నిల్చున్నాడు సుందర్రావు.

మనస్సు సంధ్యాకాశం వంటిది. ఏ క్షణంలో అది ఏవిధంగా రంగులు మార్చుకుంటుందో ఏ బాహ్యశక్తీ నిర్ణయించలేదు. కంటికి కన్పించిన దానిలో మంచిచెడ్డల్నీ, సత్యాసత్యాలనీ క్షణానికో రకంగా సమర్థిస్తూంది. అనుభవంమీద నిజాన్ని తెల్సుకోమని అంతరాత్మ ప్రోత్సహిస్తూన్నా అహంకారానికి, ఆవేశానికి తట్టుకోలేక జీవితాలనే చీకటి కోణం చేసుకుంటూరు. కళ్ళఎదుట ఉద్రేకపరిచేదృశ్యం కన్పించేసరికి కళ్లు మూతలుపడి, మనస్సు మొద్దుబారి నిజాన్ని గుర్తించుకోలేరు. గదిలో పెద్ద తివాచీమీద మధ్య మురళి వానికి రెండువైపులా విశాలాక్షి, జగన్మోహన్ ఒళ్లు తెలీని గాఢనిద్రలో వున్నారు.

ఇరవై రెండేళ్ళ జగన్మోహన్. అతని రూపంకూడా జగన్మోహనంగానే వుంటుంది. వేళ్ళను వుంగ

రాలు' రోలెక్స్ గోల్డువాచీ — జేబులో బరువైన పర్సు, ఉంగరాలు తిరిగిన క్రాఫ్. అతని రూపానికి విశాలాక్షికి కన్నుచెదిరి వుండొచ్చునేమో! అనుకొంటూ కోపోద్రేకంతో పళ్లు పటపటా కొరుకుతున్నాడు. విశాలాక్షికి నిండా ఇరవై ఏళ్లు లేవు. వీళ్ళిద్దరూ ఎన్నాళ్ళనుంచి తనచాటునదోబూచులాడుతున్నారో! ఈనాటికి పట్టుబడ్డారు. తనని ప్రేమించినట్లు నటిస్తూ, అనురాగంచూపిస్తూ తనకు అర్ధాంగిగా బిరుదుపొంది ఇన్నాళ్లూ ఆటలాడ్తోన్నట్లు తల్చుకొని కళ్లు చింతనిప్పుల్లా చేసుకున్నాడు సుందర్రావు. ఆ అనుమానంతో అతని మనస్సులో ఆకాశమెత్తు మంటలు లేచాయి. అసహ్యంతో, ఆవేశంతో అతని మనస్సు విషపు నురుగుల్ని క్రక్కుతూ, ఆమెనుండి తాను దూరంగా పోవాలని మనస్సు పరుగెడ్తూంటే; అతని మస్తిష్కంలో సంఘర్షణ ప్రారంభమైంది. ఎన్నివిధాల ఆమెను మంచిగా తల్చుకోవాలన్నా కళ్ళముందు కనిపించే దృశ్యాన్ని చూచి ఆమెను క్షమించలేకపోయాడు. తనలో తను ఆవేశం పట్టలేక నిద్రపోతోన్న విశాలాక్షిని ఫెడేలున ఒక్కతాపు తన్నాడు సుందర్రావు.

కళ్లు నులుముకుంటూ లేచి మురళి జ్వరం సంగతి చెప్పాలని ప్రయత్నిస్తోంది విశాలాక్షి.

"తక్షణం నా యింట్లోంచి బయటకు నడు. ఒక్క క్షణంకూడా నీకు ఈ యింట్లోనిల్చే హక్కు లేదు" అంటూ అరిచాడు సుందర్రావు.

విశాలాక్షి, జగన్మోహన్ కూడా రాతిబొమ్మల్లా నిలబడిపోయారు. ఇద్దరి మనస్సుల్లోనూ ఆకాశమెత్తు మంటలు లేచాయి. తామున్న భవనంకూలి తమ నెత్తిమీద పడిపోతూన్నట్లుగా అనిపించింది. సూదిమొన మోపినంత నేరం ఆధారంగా తీసుకుని బ్రహ్మాండమైన శిక్షను విధింపబోతూన్న తన గురువు సుందర్రావు ముఖం అగ్నిజ్వాలలా కనిపించింది. ఆమె కళ్ళల్లో ఆవేదన. ఆ కన్నీళ్లు చూళ్లేకపోతున్నాడు జగన్మోహన్. ఈ ప్రళయానికంతకూ తనే కారణమని తల్చుకుని కళ్ళంట నీరుకారుస్తూ నిల్చున్నాడు.

"జగన్మోహన్! విశాలా! మీ యిద్దరిలోవుండే నీచసంబంధాన్ని ఇన్నాళ్లూ నేను గుర్తించుకోలేకపోయాను. ఇప్పుడు ఇంక మీ స్వేచ్ఛకు నేనడ్డురాను. తక్షణం మీ యిష్టమొచ్చిన చోటికి పొండి" అంటూ సింహగర్జనచేసాడు సుందర్రావు.

"మాస్టారూ! మీరు చాల పొరబడుతున్నారు' పాలవంటి మనస్సు, నిప్పులాంటి శీలమూ కల ఈమెను అనుమానించడంకంటే పాతకం మరొకటి లేదు. దూరదృష్టితో ఆలోచించుకొని నిజం తెల్సుకోండి. నాకు యీమె తల్లివంటిది. నిష్కారణంగా ఈమె బ్రతుకుని కన్నీటి కెరటాల్లో ముంచకండి" అంటూ ఎంతో ప్రాధేయతగా వేడుకున్నాడు జగన్మోహన్.

ఈ సంఘటనకి తల తిరిగిపోయి విశాలాక్షి రెండు చేతులతోనూ ముఖాన్ని దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది.

చివరకు అబల అబలగానే ఓడిపోయింది. సుందర్రావు విశాలాక్షిని కొడుకుతోసహా బరబరా వీధిలోకి యీడ్చి గెంటి తలుపు వేసుకొన్నాడు. బిడ్డనైనా వుంచుకోమనీ తానీ లోకంనుంచి నిష్క్రమిస్తాననీ వేడుకొంది విశాలాక్షి. అనుమానపు జ్వాలలో మండిపోతోన్న అతని హృదయానికి ఆమె కన్నీరు అంతా అరణ్యరోదనక్రింద మారిపోయింది.

తనబిడ్డను కటిక యిసుకమీద పడుకోబెట్టి సముద్రంతో పోటీపడ్డట్లు కళ్ళంట అశ్రువులు ధారగా కారిపోతూ మనస్సులో దుఃఖతరంగాలు పొంగిపొర్లిపోతూంటే, తనమీద వచ్చిన ఈ నింద నిరాధారమైందనీ, తను నిర్దోషి అనీ ఋజువు చేసుకోవాలంటే ఆత్మహత్యకంటె తనకింక వేరే గత్యంతరంలేదని తలపోసింది విశాలాక్షి.

మురళిని ఆ యిసుకమీద పడుకోబెట్టి తను సముద్రంలోకి దిగిపోయింది.

విశాలాక్షితోనే లోకమని భావించే రోజుల్లో సుందర్రావు ఆమెతో ఎన్నోసార్లు జీవితపు విలువల్ని గురించి చర్చించాడు. దంపతుల్లో అభిప్రాయభేదాలు రాకూడదనీ, అనేకవిధాల పసిపాపకు బోధించినట్లు చెప్పేవాడు. జీవితంలో వర్తమానంలో ఏ చిన్నలోపాలు వున్నా సర్దుకుపోతూ బిడ్డలభావికి తమ దాంపత్యమే తమలోని సుగుణాలే భవిష్యత్‌లో బిడ్డలకి గుణపాఠంగా వుండాలనేవాడు. అటువంటి సుందర్రావు ఆశలు, ఆశయాలు, ఆనందవెలుగులు, అనురాగం ఇవన్నీ విలువలేని ద్రవపదార్థాలుగా మారిపోయి, అరక్షణంలో అనుమాన బీజం నాటుకుని భూదేవితో సమానమైన ఓర్పుగల పరమసాధ్వి, సీతా, సావిత్రులతో సమానమైన శీలసంపదగల తన

యిల్లాలు సముద్రునిపాలైనా కూడా ఆమె రక్తం లోని బిడ్డకు మురళిమీద కూడా ఆ దోషం ఆపాదించి జాలి, దయ, ప్రేమలను సమూలనాశనం చేసుకున్నాడు.

గట్టున యిసుకమీదనుంచి పడి ప్రాకులాడుతూ నీళ్ళల్లోకి వెళ్ళిపోతోన్న మురళి; సముద్రపు కెరటాల్లో కొట్టుకుపోయే మాతృమూర్తినీ దూరంనుంచి పరుగెత్తుకుంటూ వచ్చే జగన్మోహన్ చూచాడు. అతని గుండెల్లో వెయ్యి రైళ్లు, నూరు విమానాలు పరుగెత్తుతున్నాయి. ఎల్లా పరుగెత్తుకువచ్చాడో, ఎంతవేగంగా ఆ ఇసుకలో అర్థంలేని ఆవేశంతో గబగబా బస్సుతో పోటీపడ్డ మానవునిలా నోటంట నురుగలు క్రక్కుతూ పరుగెత్తుకువచ్చి దభీమని సముద్రంలో దూకాను. తన ప్రాణాలనికూడా లెక్క చేయక ఆ మానవాకారం కన్పించేవరకు ఈదుకుంటూ వెళ్ళాడు. సముద్రుడు పొంగిపోతూ ముందువేసిన కెరటంతో ఆమెను ఎంతోదూరం లాక్కుపోయినా. పతివ్రతామ తల్లుల్ని మాత్రం తనలో లీనం చేసుకునేందుకు అనర్హుడనని గుర్తించినట్లుగా మరో బ్రహ్మాండమైన కెరటం వచ్చి గట్టువైపుకు నెట్టింది. ఆమెను గట్టిగా పట్టుకుని గట్టుకు వచ్చాడు జగన్మోహన్.

“జగన్మోహన్! నా శీలాన్ని శంకించి... భర్త చేత పరిత్యజించబడి అపకీర్తిపాలైన నేను ఈ బిడ్డకు తల్లి అని చెప్పుకుందుకుకూడ అనర్హురాలినయ్యాను. ఇప్పుడు ఇంక నా ప్రాణానికే విలువలేదు. నా బ్రతుక్కి అర్థమూ, ఆశ అనేవిలేవు. అటువంటప్పుడు నేనెవరికోసం బ్రతకాలి? నేనెందుకోసం ఇంకా జీవించాలి? నన్నెందుకు బయటకు తీశావ్?” అంటూ కన్నీటితో విలపించింది విశాలాక్షి.

“అమ్మా! దిక్కుమొక్కులేనట్లు బిడ్డకు తల్లిని కరువుచెయ్యడం మంచిదేనా? కన్నకొడుకుకోసమైనా జీవించాలి” అన్నాడు దీనంగా జగన్మోహన్.

“నీకా అభిమానమే వుంటే మురళిని జాగ్రత్తగా పెంచుకో, నా ఎడారి బ్రతుకుని ఇల్లా అంతంచేసుకోనియ్యి. అపవాదులతో జీవించడంకంటే మరణించడమే ఉత్తమం.”

“అమ్మా! త్రేతాయుగంలో సీతామహాసాధ్వికే అపవాదు వచ్చింది. అపవాదుకు ఝడిసి జీవితానికి మంగళం పాడినంతమాత్రంలో అవి నశిస్తాయా? ధైర్యంగా నిలచి జీవితాన్ని ముందుకి సాగించి నీ మురళిని పెంచి పెద్దచేసి నీ నిర్దోషిత్వం ఋజువు చేసుకున్ననాడే నీ స్త్రీ జీవితం సార్థకమౌతుంది. జీవితం దుఃఖభాజనమైనా మనస్సుని ధైర్యపరచుకొని వివేకంతో మీ తరువాత తరంవారైనా ధైర్యంగా జీవించాలని గుణపాఠం చెప్పేలా మీరు జీవించాలి. మీ బిడ్డకోసం, వాని ఉజ్జ్వలభవిష్యత్ కోసం, మీలోని మాతృవాత్సల్యాన్ని చంపుకోక మీ బిడ్డకు దైవత్వాన్ని ప్రసాదించేందుకై మీరు జీవించక తప్పదు. మీరు జీవించకపోతే! నన్ను గురించే మీరిల్లా అయిపోయారని, మీ దంపతుల్లో కలతలకు కారకుణ్ణి నేనేనని... ఇప్పుడే మీ కళ్ళ ముందే నేనూ ఆత్మహత్య చేసుకుంటాను.”

సముద్రం ప్రక్కన శోకమే రూపంగా-మూర్తీభవించినట్లు కంటికీమంటికీ ఏకధారగా కన్నీరుకారుస్తూ కొడుకుని ఒళ్లోకి తీసుకుకూర్చుంది విశాలాక్షి.

“అమ్మా! మిమ్మల్ని నేను తల్లిలా, సోదరిలా చూసుకొంటా. నాతో కల్సివుండడం ఇష్టంలేకపోతే మీకు వేరే ఇల్లు చూచి అందులో కాపురం పెట్టిస్తా. నా సొమ్ముతో మీరు జీవించడం ఇష్టంలేకపోతే మీకే వుద్యోగమో; లేకపోతే మా మాష్టారులా పాతికమంది పిల్లలకి ప్రయివేటు చెప్పినా మీ జీవితం గడిచిపోతుంది. కష్టాలు కలకాలం కాపురం చెయ్యవు. ఎప్పటికైనా మాష్టారు తన తప్పును గుర్తించి మిమ్మల్ని తీసుకువెడతారు” అంటూ అనేక విధాల జగన్మోహన్ చెప్పాక చిట్టచివరకు అంగీకరించింది విశాలాక్షి.

జగన్మోహన్‌కి గొప్ప ఆస్థిపాస్తులు లేకపోయినా అన్నోదకాలకు లోటులేదు. ఏడాది క్రితంవరకూ తల్లిచేతిలో అల్లారుముద్దుగా పెరిగాడు. తల్లి చనిపోయేముందే పెళ్లిచేసుకోమంది అతన్ని. కాని, బి. ఏ. పూర్తిచేస్తేనే కాని పెళ్లాడనని భీష్మించుకు కూర్చున్నాడు. వృద్ధమాత ఈ లోకాన్ని వదిలాక వంటరివాడై తెగిన గాలిపటంలా సత్రభోజనం, మఠానిద్ర అన్నట్లు కాలాన్ని దొర్లిస్తున్నాడు. యస్. యస్.యల్.సి. లో నుంచీ సుందర్రావు దగ్గరకి ప్రయివేటుకు వస్తూండేవాడు.

అయిదేళ్లనుంచీ సుందర్రావు తన గురువు. విశాలాక్షినికూడా తల్లిలా భావించేవాడు. తల్లిచాటున, పల్లెవాతావరణంలో లోకంలోని కల్మషమనేది తెలియకుండా అమాయకంగా పెరిగాడు జగన్మోహన్.

విశాలాక్షి ఇష్టప్రకారం ఆమెకు వేరేఇల్లు చూచి

అందులో కాపురంపెట్టి, ఆ ప్రక్కవాటాలోవున్న ఒక గదిలో తానుండేవాడు. ఆమె ఎల్లప్పుడు దిగులుగావుంటే అతను ధైర్యం చెబుతూ సానుభూతిని చూపించేవాడు జగన్మోహన్.

విశాలాక్షిలోని మాతృత్వపు ప్రేమవాహిని మురళిపైనే కాకుండా జగన్మోహన్ మీద కూడా సమంగా చూపించేది. ఆ మాతృమూర్తివంటి విశాలాక్షి ఆదరణలో తల్లిలేని లోటును మర్చిపోగల్గుతున్నాడు జగన్మోహన్.

ప్రతిరోజూ "అమ్మా" అని పిలుస్తూ వచ్చేవాడు జగన్మోహన్. "నాయనా!" అని ఆదరించేది కరుణామూర్తియైన విశాలాక్షి. వచ్చీరాని మాటలతో "అన్న అన్నా" అనేవాడు మురళి.

కాలగర్భంలో ఆరుమాసాలు దొర్లాయి. విశాలాక్షికి కొడుకు సంరక్షణ, ఏదో ప్రాణాల్ని నిలుపుకొందుకు వంటభోజనం మిగతా కాలమంతా దైవధ్యానంతోనే హెచ్చుగా గడిపేది. తనభర్త శ్రేయస్సుకోసం సదా దైవాన్ని ప్రార్థించేది.

ఒకరోజు జగన్మోహన్ విశాలాక్షి యింట్లోకి అడుగుపెడ్తూంటే ప్రక్కవాటాలోనుంచి కొన్ని మాటలు వినిపిస్తున్నాయి. "అసలు ఆవిడ్ని భర్త వదిలేశాడట అని ఒకామె; అంతేకాదు. ఆ మురళి కూడా కట్టుకున్న భర్తకు పుట్టినవాడుకాదట అని మరొకరు; అందుకే పెళ్లిపెటాకులు లేకుండా ఈవిడ్ని తీసుకువచ్చి వుంచుకున్నాడు"... ఇల్లాంటి మాటలు వినబడేసరికి ఇంక వినలేక జగన్మోహన్ చెవులు మూసుకున్నాడు.

పరస్త్రీలను తల్లులుగా, తోబుట్టువులుగా భావించమని ధర్మోపదేశంచేసే లోకమే తల్లీబిడ్డల మధ్య అన్నా చెల్లెళ్ల మధ్యవుండే పవిత్ర బాంధవ్యాన్ని గుర్తించలేదు.

వయస్సులోవున్న యిద్దరు స్త్రీ పురుషులు ఒకచోట కూర్చుంటే, మాట్లాడుకొంటే, వారిమధ్య బాంధవ్యమేమిటో ఆలోచించకుండా పరమనీచమైన ముద్ర వెయ్యడానికి వెనుకంజవెయ్యదీ మాయలోకం. జీవుల పాపపుణ్యభారం తామే వహించినట్లుగా సహస్రముఖాలా ఘోషిస్తారీ లోకులు. విశాలాక్షిని తానెన్నడూ కనీసం స్వప్నావస్థలో కాని, జాగ్రదావస్థలోకాని తల్లిగా తప్పించి మరేభావంతోనూ చూడలేదే! ఆ పవిత్రమూర్తి సన్నిధిలో తానెంతో విధేయతగా దేవాలయంలో జగన్మాత ముందున్నట్లు, తల్లిముందు కన్నబిడ్డలా ప్రవర్తిస్తున్నాడే! ఈ లోకం స్త్రీని పురుషుడికి సంతోషాన్నిచ్చే ఒక సాధనంగానే గుర్తిస్తుందా? స్త్రీలోని చపలత్వాన్నే చూస్తుంది గాని ఆ స్త్రీహృదయసాగరంలోని మాతృప్రేమామృతాన్ని చూడగలిగేవారే లేరా? ఈ లోకంలో పరమపవిత్రురాలైన విశాలాక్షివంటి మహాతల్లులని గుర్తించి గౌరవించేవారే లేరా? భర్తచేత తిరస్కరింపబడితే ఇంక ఈ లోకమంతా కూడా వారిని హీనంగానే చూస్తారా? ఇల్లాంటి మాటలు ఆమె చెవులబడితే ఇంక జీవిస్తుందా?...

ఒక్కసారిగా విశాలాక్షిని గురించి ఇల్లాంటి మాటలు వినేసరికి జగన్మోహన్కి మతి చెడినట్లయింది. అతని మనస్సులో వెయ్యి అగ్నిపర్వతాలు బ్రద్దలైనట్లనిపించింది. అడవిలో చెంగుచెంగున స్వేచ్ఛగా ఎగురుతూ తిరిగే లేడిపిల్లమీద వేటగాని విషపుబాణం తగిలినట్లు గిలగిల్లాడిపోయాడు జగన్మోహన్. కనీసం కలలోనైనా ఊహించని ఇల్లాంటి మాటలు తననిగురించి అనుకొంటూ వున్నందుకు ఆ అమాయికహృదయం విహ్వలమైపోయింది. ఒక ఏకాంత ప్రదేశానికిపోయి తనివితీరా ఏడ్చి కొంత మనోభారం తగ్గించుకున్నాడు జగన్మోహన్.

మురళి అన్న అంటూ వేళమించినా రాని జగన్మోహన్కోసం గొడవచేస్తున్నాడు. ప్రతీరోజూ పగలు రెండుమూడు సార్లు అయినా తనని పలకరించి వెళ్లే అతడు ఆరోజు సాయంత్రమైనా ఇంటికి రాకపోయేసరికి మనస్సులో పరిపరివిధాల పోయింది. అతనికేమైనా అపాయం కల్గిందా; ఏదైనా ప్రమాదానికి గురి అయ్యాడా? అని ఎన్నోవిధాల మనస్సులో శంకిస్తూ కొడుకుని చంకను ఎత్తుకు అరుగుమీద నిల్చుంది విశాలాక్షి. ఆమెకు విన్పించాలన్న ఉద్దేశంతో ప్రక్కవాటాలోవున్న ఆమె "పాపం! ఆ కుర్రాడు పెళ్లీపేరంటం అయి వృద్ధిలోకి రావలసినవాడు; ఇంతకీ తోలుక్రిందరాత దొంగరాత; ఎవరు తప్పించగలరు? యీ పరాయివాని పెళ్లాంతో కులుకుతూ పెళ్లీపేరంటంలేకుండా అల్లాగే వుంటాడు కాబోలు? ఇంకా "అమ్మా!" అనికూడా పిల్పించుకుంటుంటెందుకో? తల్లికి మొగుడు రకమంటే ఇదే కాబోలు!" అంటూ వినీవిన్పించనట్లు కొన్నిమాటలు విన్పించాయి విశాలాక్షికి.

ఆ మాటలు విన్న విశాలాక్షికి తనున్న భూమి కాళ్ళక్రిందనుంచి క్రిందికి దిగజారిపోతూన్నట్లనిపించింది. దుఃఖంపొంగి పొర్లుకొస్తూంటే పార్వతీ విగ్రహం ముందుపడి భోరున ఏడ్చింది. లోకమంతా భీకరరూపంతో మూచి వికటాట్టహాసం తనపైనే చేస్తూన్నట్లనిపించింది ఆమెకి. (సశేషము)

# ముద్దుకృష్ణ

శ్రీమతి దేశిరాజు భారతీదేవి



శ్రీ రమాదేవి యురమున, చెన్నుమీర
నిలచి కల్యాణియై లోకముల సృజింప
నందు చైతన్య మూర్తివై యలరునీవు
ప్రోచి భాసింప జేతువు ముద్దుకృష్ణ!

పాలమున్నీటి తరగల శాప పాన్పు
రోసి వ్రేపల్లె వాడవిచ్చేసి బసుల
కొట్టములలోన వసియింపగోరినావు
పూప బిడ్డవుగావున ముద్దు కృష్ణ!

పుట్టుటకు మున్నె బ్రహ్మాయు మునులు సురలు
వచ్చినిను గూర్చి పొగడుచు వందనములు
సలిపినారలు నాకెట్లు సాధ్యమగును
పుణ్య పూరుషనిన్నెన్న ముద్దుకృష్ణ!

నాలుగు భుజాల తోడ విశాలనేత్ర
కమలములతోడ శంఖ చక్రములతోడ
కౌస్తుభముతోడ జనియింపగలరె యొరులు
భువన మోహన నీవలె ముద్దుకృష్ణ!

జోలపాడి యశోద ఉయ్యాల నూపి
వంగినిను జూచి నిద్దురవచ్చెననుచు
కదలిపో నీవు గ్రమ్మరకన్ను దెఱచి
మోసగించెద వేలరా! ముద్దుకృష్ణ!

ముద్దుగొన తల్లి దండ్రులు ముద్దు గొనగ
పొరుగు తల్లులు పెద్దలు ముద్దుగొనగ
మురిపెమునగొల్ల పిల్లలు ముద్దుగొనగ
ముద్దులకు రాశివైతివి ముద్దుకృష్ణ!

వద్దువద్దన్న కొద్దియు ముద్దుపిడుచు
పెద్దవారలు తద్దయు కొద్దివారు
సదమలానంద పారవశ్యంబు నంది
పోదురు గదయ్యనిను జూచి ముద్దుకృష్ణ!

నందసుందరి నందుడానంద వార్ధి
వీచి కాడో వికలనూగి విశ్వమయుడ
వంచు మదినెంచి ప్రేమతో పెంచినారు-
పుణ్య పూరుష నిను శ్రద్ధ ముద్దుకృష్ణ!

భువన మోహనమై ప్రేమపూరమైన
సకల వేదాంత వాక్యార్థ సారమైన
సచ్చిదానంద వైభవస్ఫారమైన
మురువు చవిగొందురారవో ముద్దుకృష్ణ!

తల్లిగాం కేలు మాటికి తడవి తడవి
పట్టుకొనుచును కాళ్ళకు జుట్టుకొనుచు
రాకుమన్నను వచ్చి మరాము సేయు
మురువు నొకసారి జూపరా ముద్దుకృష్ణ!

ముంగురులు మోముపై వ్రాలిచెంగలించి
తళుకు చెక్కులపై జారి కులుకుచుండ
చిరుత ముసి ముసి నవ్వుల మురువుచిందు
పరువుదీపెడి వేళ గోపాల కృష్ణ!

ఆటలాడుచు ధూళిలో నవనిదొర్లి
బూది బ్రమింగిన వంటితో బొరవి పొరవి
వచ్చు నేడుపుతో జేరవచ్చు నీదు
పొలుపు జావిఘటించు గోపాల కృష్ణ!

పొరుగువారల యిండ్లకు పోకుమనుచు
తల్లివారింప వినకుండ పిల్ల తనపు
కొంటె కోణంగి వగుచు నింటింట దిరిగి
బూచివై గోచరించెదు ముద్దుకృష్ణ!

(సశేషము)

# నిజం నిలకడమీదనేగా !!!

మూలం :
టాల్‌స్టాయ్ కథలు

స్వేచ్ఛానువాదం :
'భరణి'

"వాల్డమెర్" అనే పట్టణంలో "ఇవాన్" అనే యువకుడుండేవాడు. ఇవాన్‌కి ఒక సొంత ఇల్లు, రెండు దుకాణాలుండేవి.

ఇవాన్ సరదా మనిషి. సంగీతం అంటే చెవి కోసుకునేవాడు. ఇవాన్‌కి మొదట త్రాగుడు అలవాటుండేది. కాని, వివాహం తరువాత మానేశాడు. ఎప్పుడైనా త్రాగితే త్రాగేవాడేమో.

ఒకరోజు 'ఇవాన్' సరుకు విక్రయించటానికి బండిమీద వేసుకుని మార్కెట్టుకు బయలుదేర బోతుంటే... "ఈరోజు వెళ్ళద్దు. రాత్రి నాకు చెడ్డ స్వప్నం వచ్చింది" అని ఇవాన్ భార్య అతన్ని నివారించబోయింది.

"నేను మార్కెట్టుకెళ్ళి తప్పత్రాగుతానేమో అనేగ నీ భయం" అన్నాడు ఇవాన్ నవ్వుతూ.

"కాదు... నా భయమేమిటో చెప్పలేను. కాని దుస్వప్నం వచ్చింది. మీరు పట్టణంనుండి రాగానే మీ జుట్టంతా నెరిసినట్టుగా స్వప్నంలో కనిపించింది" అని అన్నది ఇవాన్ భార్య ఆందోళనతో. ఇవాన్ మళ్ళీ పెద్దగా నవ్వాడు. "నీకు వచ్చిన స్వప్నం శుభసూచకం. ఈరోజు సరుకంతా విక్రయించి నీకు బహుమతులు తెస్తాను..." అని భార్య మాటలను పెడచెవిన పెట్టి వెళ్ళిపోయాడు. అస్కినోవ్ భార్యకు మాత్రం భయంగానే వుంది. ఇవాన్‌ని అస్కినోవ్ అనికూడా పిలుస్తారు.

అస్కినోవ్ కొంతదూరం ప్రయాణంచేసిన తరువాత దారిలో అతనికి మిత్రుడొకడు కనిపించాడు. ఇద్దరూ ఆ రాత్రి ఒకచోటునే బసచెయ్యాలనుకున్నారు. రాత్రి సత్రంలో భోజనంచేసి యెవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళి శయనించారు. అస్కినోవ్‌కి రాత్రిపూట ఆలశ్యంగా నిద్రపోవటం అలవాటు. సూర్యోదయం ముకాకనుపే ప్రయాణంచేస్తే చల్లగా హాయిగా ఉంటుందని, హోటల్ యజమానికి పైకం చెల్లించి ప్రయాణంకట్టాడు. చల్లని వాతావరణం, హాయిగా వుంది. పాతిక మైళ్ళు ప్రయాణం సాగించి ఊరుదగ్గరనున్న సత్రం దగ్గర బండి ఆపాడు గుఱ్ఱాలకి మేత వేయటానికి. కులాసాగా పాడుకుంటూ కూర్చున్నాడు. మూడుగుఱ్ఱాల బండొకటి వచ్చి ఆగింది. ఆ బండిలోనుంచి ప్రభుత్వోద్యోగి, అస్కినోవ్ దగ్గరకొచ్చాడు.

"నీ పేరేమిటి? నీదేవూరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని అడిగాడు. అస్కినోవ్ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పాడు. "మనిద్దరం తేనీరు త్రాగుదాం" అని అన్నాడు అస్కినోవ్ విషయం గ్రహించకుండా. "గతరాత్రి యెక్కడున్నావు? ఒంటరిగానే వున్నావా లేక మరెవరితోనైనా ఉన్నావా? నీతో వచ్చిన వ్యాపారస్థుడేడి? అతన్ని విడిచిపెట్టి నువ్వెందుకు వచ్చేశావు?" ప్రశ్నలవర్షం కురిపించాడు ఆ ఉద్యోగి.

అస్కినోవ్ కింకా విషయం బోధపడలేదు. అంతా గందరగోళంగా వుంది. "ఈ ప్రశ్నలు నన్నెందుకు అడుగుతున్నాడు? నేను నా పనిమీద వెళ్తున్నాను. ఈ ప్రశ్నలు అడగవలసిన అవసరమేమిటి?" అని వినయంగా సమాధానం చెప్పాడు అస్కినోవ్.

ప్రభుత్వ ఉద్యోగి భటుల్ని పిలిచాడు. "నేను పోలీసు అధికారిని. నిన్నరాత్రి నీతో ఉన్న వ్యాపారస్థుడు హత్యచేయబడ్డాడు. పొడిచి చంపేశారు. మీ సామానులన్నీ శోధించాలి" అని అస్కినోవ్ బండిలోని సరుకంతా పరీక్షించారు. సంచిలో రక్తపు మరకలున్న పొడుగాటి కత్తి దొరికింది. అస్కినోవ్ ఆశ్చర్యపోయాడు. నోట మాట పెగల్లేదు. కొన్నిక్షణాల తరువాత తేరుకుని 'నాకేం తెలీదు'— అని ఊరుకున్నాడు. "ఈరోజు ప్రొద్దున నిన్న నీతోవున్న వ్యాపారస్థుడు గొంతు కోయబడి గదిలో పడివున్నాడు. ఈ ఘోరకార్యం నువ్వుతప్ప మరెవరూ చేసే అవకాశంలేదు. గది తలుపులు లోపలవేసి ఉన్నయ్. నీ సంచిలో రక్తపు మరకల కత్తి దొరికింది. ఆ వర్తకుడిని యేవిధంగా చంపింది, యెంత దొంగిలించింది చెప్పు" అని దబాయించాడు పోలీసు అధికారి.

"నేను వర్తకుడిని చంపలేదు. నిన్న మేమిద్దరం కలసి తేనీరు త్రాగిన తర్వాత నేనతన్ని మళ్ళీ చూడలేదు. నా దగ్గర ఎనిమిది వేల రూబుల్స్ మాత్రమే ఉన్నయ్. అది నా స్వంతధనం" అని వణుకుతూ చెప్పాడు అస్కినోవ్. మొహంలో నెత్తురుచుక్క లేదు.

అస్కినోవ్‌ని కాళ్ళుచేతులు కట్టేసి బండిలో పారేశారు. అతని సామాన్లు, ధనం, స్వాధీనం చేసుకున్నారు. వాల్టమేర్ పట్టణవాసుల్ని అస్కినోవ్ నడతగురించి విచారించారు. "అప్పుడప్పుడు త్రాగే అలవాటు ఉంది. కాని మనిషి మంచివాడు" అని ఇరుగుపొరుగు వారన్నారు. రైజాన్ అనే వర్తకుడిని చంపి యిరువది వేల రూబుల్స్ దొంగిలించిన నేరానికి కఠినశిక్ష విధించారు.

అస్కినోవ్ భార్య దుఃఖానికి అంతులేదు. పిల్లలు యింకా చిన్నవాళ్లు. ఏం చెయ్యాలో తెలీలేదు. అతికష్టంమీద భర్తని ఖైదీలో ఒకసారి కలుసుకుంది. జరిగిందంతా విన్నది. "మనం యిప్పుడు చెయ్యాల్సింది యేమిటి?" అని అడిగింది అస్కినోవ్ భార్య. అస్కినోవ్ సమాధానం చెప్పలేదు. "నీవారోజు ప్రయాణం అవబోతుంటే వద్దని నివారించాను. పీడకలగురించి చెప్పాను. కాని నువ్వు వినలేదు. నాకైనా నిజంచెప్పు" అని కంట తడిపెట్టింది. అస్కినోవ్ ఆశ్చర్యపోయాడు. "చివరికి నీక్కూడా నామీద నమ్మకంలేదు" చేతుల్లో తల పెట్టుకుని బావురుమన్నాడు.

ఇంతలోకి జైలధికారి వచ్చి అస్కినోవ్ భార్యాపిల్లలకి వేళైందని హెచ్చరిక చేశాడు. అస్కినోవ్ భార్యా, పిల్లల దగ్గర శెలవు తీసుకొన్నాడు. తన భార్యకూడా తనని అనుమానిస్తోందని విచారించాడు. "నిజం నిలకడమీదనే తెలియాలి. అంతా భగవంతుడి మాయ" అని తృప్తిపడ్డాడు.

అస్కినోవ్ కఠినశిక్ష అనుభవించవలసి వచ్చింది. కొరడాలతో కొట్టారు. గనుల్లో కఠినపని చేయించారు. దెబ్బలు మానిపోయిన తరువాత సైబీరియా పంపించారు. సైబీరియాలో యిరువది ఆరు సంవత్సరాలు గడిచిపోయినయ్. నల్లని జుట్టు గెడ్డం నెరిసింది. నెమ్మదిగా మాట్లాడటం భారంగా నడవటం అలవాటయింది.

వృద్ధ అస్కినోవ్‌మీద జైలధికారులకీ తోటి స్నేహితులకి గౌరవం యేర్పడింది. 'తాతయ్యా' అని పిలిచేవాళ్లు. కుటుంబ వ్యవహారాలు యేమీ తెలియలేదు.

ఒకరోజు కొంతమంది నేరస్తులు కొత్తగా ఖైదుకి వచ్చారు. వాళ్ళు రాగానే, పాతనేరస్తులు కొత్తవాళ్ళని యెన్నో విషయాలను గురించి అడుగుతుంటే అస్కినోవ్ కూడా అక్కడే కూర్చున్నాడు. కొత్తగా వచ్చినవాళ్ళలో ఒక వృద్ధనేరస్తుడున్నాడు, తానెందుకు శిక్ష అనుభవించుతోందో చెపుతున్నాడు. "నేనొక చిన్న నేరం చేశాను. బండికి కట్టివున్న గుఱ్ఱాన్ని విప్పుకుపోయాను. ఈ చిన్న నేరానికే నాకు శిక్షపడింది. కాని యింతకు మునుపు ఒక పెద్దనేరం చేశాను. దానికి శిక్ష పడలేదు" అని అన్నాడు ధీమాగా కొత్తగా వచ్చిన నేరస్తుడు.

"నీదేవూరు?" అన్నాడొకడు.

"నాది వాల్టమేర్. మావాళ్ళంతా ఆ ఊరివాళ్ళే. నా పేరు మకార్."

వాల్టమేర్ పేరు వినగానే అస్కినోవ్‌కి వళ్ళు పులకరించింది. "నీకు ఆవూరు వ్యాపారస్థులను గురించి యేమైనా తెలుసా?" అన్నాడు.

"నాకు అంతా తెలుసు. అస్కినోవ్‌లు ధనవంతులు. కాని వాళ్ళతండ్రి మనలాగే సైబీరియాలో ఉన్నాడుట. అయినా నీవు యెలా వచ్చావు తాతా."

"నేను యిరువది ఆరు సంవత్సరాలుగా యిక్కడ ఉంటున్నాను" అని తలవంచుకున్నాడు.

"నీవు చేసిన నేరమేమిటి?"

అస్కినోవ్ మాట్లాడలేదు. కాని అతని స్నేహితులు జరిగిందంతా చెప్పారు.

"అద్భుతంగా వుంది" అన్నాడు మకార్.

"నీవింత ఆశ్చర్యపోవటానికి కారణమేమిటి? అస్కినోవ్ విషయం యేమైనా తెలుసునా నీకు?" అని అడిగారు చుట్టూమూగిన ప్రజలు.

సమాధానం చెప్పలేదు. "అద్భుతంగా వుంది" అని ఊరుకున్నాడు మకార్. ఇతడికి యేదో కొంత విషయం తెలిసివుండాలి. లేదా కనీసం యెవరు హంతకుడైందో తెలిసివుండాలి అని నిశ్చయించుకున్నాడు అస్కినోవ్. "ఎవరు చంపిందో నువ్వు చూశావా? పోనీ విన్నావా?" అన్నాడు అస్కినోవ్ మకార్ కళ్ళలోకి సూటిగా చూస్తూ. మకార్ పెద్దగా నవ్వాడు. "ఎవరి సంచిలో కత్తి దొరికిందో వాడేగా హంతకుడు. ఎవరైనా కత్తి దాచివుంచిన పక్షంలో అతడు పట్టుబడేంతవరకు హంతకుడు కాదు

గదా?" ఈ మాటలు అక్సినోవ్ అనుమానాన్ని దృఢపరిచినయ్. తప్పక మకార్ హంతకుడు. సందేహంలేదు. మౌనంగా లేచి వెళ్ళిపోయాడు. ప్రేమాస్పదంతో ఆహ్వానించే భార్య మొహం స్మృతిపథంలో కనిపించింది. నవ్వుతూ మాట్లాడుతున్న మాటలు వినిపించినయ్. ఎలప్రాయంలో నున్న కుమారుడు కనిపించాడు. చిన్నవాడు తల్లి దగ్గర పాలు త్రాగుతున్నాడు.... తను యువకుడు? హాయిగా కాలం గడుపుతున్నాడు. ఇదంతా యిరువది ఆరు సంవత్సరాల క్రిందటి విషయం. తానేవిధంగా పట్టుబడింది గుర్తుకు రాగానే సుందర స్వప్నాలు చెరిగిపోయినయ్. ఇదంతా మోసంవలన జరిగింది అని తలంచుకున్నప్పుడు వళ్ళు మండిపోయింది. మకార్‌తో మాట్లాడటం మానేశాడు. రాత్రిళ్ళు నిద్రపట్టేదికాదు.

ఒకరోజు రాత్రి అక్సినోవ్ అటూయిటూ పచార్లు చేస్తున్నాడు తన గదిలో. గోడలోనున్న రాయి కదలిక వినిపించింది. మెల్లిగా రాయి తొలిగింది. పెద్ద కంతనుండి యెవరో వ్యక్తి దూరాడు. అక్సినోవ్ వెంటనే అతని చేతిని పట్టుకున్నాడు. రోజూ గోడ త్రవ్వి ఆ మట్టిని బూటులో పోసుకుని పారబోసేవాడు మకార్.

"ఒరే ముసలీ! నిశబ్దంగావుండు. కొద్దిసేపట్లో బయటపడదాం. అధికారులు పట్టుకుంటే కొరడాలతో కొడతారు."

కోపాగ్నితో అక్సినోవ్ శరీరం కంపనజెందింది. "పారిపోవాలన్న ఆశ నాకులేదు. నన్ను చంపవలసిన అవసరం నీకులేదు. చాలాకాలం క్రిందటనే నన్ను చంపేశావు - అధికారులకు నిన్ను వప్పగించేదీ లేనిదీ భగవంతుడాజ్ఞమీద ఆధారపడివుంటుంది" అన్నాడు అక్సినోవ్.

బూటులో మట్టిపోసుకొని పారబోస్తుంటే మకార్ పట్టుబడ్డాడు. గోడత్రవ్వి కంతచేసిందెవరని గవర్నరు విచారించాడు. ఎవరికీ యేమీ తెలీదన్నారు. అక్సినోవ్ దగ్గరకొచ్చి "నువ్వు నిజం చెపుతావు. ఎవరు చేసినపని యిది?" అమాయకుడిలా మకార్ గవర్నరువైపు చూశాడు. అక్సినోవ్‌కి నోటమాట పెగల్లేదు. చేతులు వణికినయ్. చాలసేపు మాట్లాడలేదు. "నా జీవితాన్ని నాశనం చేసినవాడిని యెందుకు కాపాడాలి? నేననుభవించినదానికి వాడెందుకు ప్రతిఫలం పొందకూడదు? నేను నిజంచెపుతే వాడ్ని కొరడాలతో కొడతారు - వూపిరి పోయేంత వరకు. దీనివలన నాకు లాభం యేముంది?" పరిపరి విధాల ఆలోచించాడు అక్సినోవ్.

"ఓయి వృద్ధుడా నిజం చెప్పు" అని గదమాయించాడు గవర్నరు.

అక్సినోవ్ మకార్ వంక చూచాడు. "నేనేమీ చెప్పలేను. ఏం చెప్పటానికీ భగవంతుడి ఆజ్ఞలేదు. నేను మీ చేతుల్లో ఉన్నాను. మీ యిష్టంవచ్చినట్లు చెయ్యండి" అని అన్నాడు అక్సినోవ్ చేతులు కట్టుకుని.

ఆరోజు రాత్రి అక్సినోవ్ యేదో ఆలోచిస్తూ పడుకున్నాడు. నిద్రపోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఒకవ్యక్తి మెల్లిగా అక్సినోవ్ పడకదగ్గరకొచ్చాడు. వచ్చింది మకార్ అని గ్రహించాడు అక్సినోవ్. "నేను యింకేం చెయ్యాలి నీకు? ఎందుకు వచ్చావు?" అన్నాడు అక్సినోవ్ - మకార్‌వైపు చూడకుండానే. మకార్ మాట్లాడలేదు. నిశబ్దంగా కూర్చున్నాడు. "నీవు వెళ్ళిపో... లేకపోతే భటుల్ని పిలిచి పట్టిస్తాను" అన్నాడు అక్సినోవ్. మకార్ దగ్గరగా జరిగి "నన్ను క్షమించు" అన్నాడు.

దేనికి?

"ఆ వ్యాపారస్తుల్ని చంపింది నేనే. వాళ్ళని చంపి ఆ కత్తిని నీ సంచిలో దాచాను. నిన్నుకూడా చంపటానికి ప్రయత్నించాను. బయట అలజడి వినిపించేసరికి కిటికీలోగుండా పారిపోయాను" అన్నాడు మకార్. అక్సినోవ్ మాట్లాడలేదు. "నన్ను క్షమించు... నేరాన్ని ఒప్పుకుంటాను. నిన్ను విడుదల చేస్తారు. వెళ్ళిపో" అని బ్రతిమాలాడు మకార్.

"మాట్లాడటం తేలికే. నీకోసం నేను ఈ యిరువది ఆరు సంవత్సరాలుగా యిక్కడ ఉన్నాను. ఇప్పుడు యెక్కడికి వెళ్ళేది."

అక్సినోవ్ పలుకులు మకార్ కఠిన హృదయాన్ని వజ్రపుకోత కోసినయ్. అశ్రువులు ధారగా రాలినయ్.

"భగవంతుడు నిన్ను క్షమిస్తాడు. బహుశా నేనే నీకన్నా నూరురెట్లు నేరస్తుడ్ని కావచ్చు" అన్నాడు అక్సినోవ్ మకార్ వైపు జాలిగా చూస్తూ. అక్సినోవ్‌కి ఇంటికి పోవాలన్న కోరిక పూర్తిగాపోయింది. హృదయం తేలికపడింది.

మకార్ నేరాన్ని అధికారుల దగ్గర ఒప్పుకున్నాడు. విడుదల ఉత్తరువులు రాకపూర్వమే అక్సినోవ్ ఈ ప్రపంచం నుండే విముక్తుడయ్యాడు.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౨౧

యోగశాస్త్రంబులేల? వియోగమేల?
దానయజ్ఞ గంగాది తీర్థంబులేల?
అఖిల విద్యలు, బ్రహ్మచర్యాశ్రమంబు
లేల? ఓ రఘురామ! నీ లీలలరసి
కీర్తనము, సేయుభక్తి, మొక్కులంతలేక
నున్న, నిష్ప్రయోజనమవ్వి; సన్నుతాంగ
వరద! శ్రీ రమానాథ! నీ భక్తి, నాకొ
సంగి రక్షింపు ప్రార్థనల్ - సలుపుచుందు

౨౨

రామభద్ర! దయానిధీ - రామచంద్ర!
భక్తజనముల రక్షించు - పావనాత్మ!
జగములఁ బవిత్రమొనరించు చరణపద్మ
యుగ్మములు గల్గు శ్రీరామ! యోగి హృదయ
పుటనివాస! సీతాపతీ! భువనజాల
ములకు నాధారమైనట్టి పుణ్యమూర్తి!
శరణు వేడెద - నీపాద చరణములను
రక్షణము సేయుమయ్య! శ్రీరామచంద్ర!

౨౩

శ్రీ పసన్న మూర్తి! శ్రితయోగి చంద్రుండు
రామభద్రమూర్తి రక్షకుండు
మూడుతాపములను బోకార్చియజ్ఞాన
తిమిరమడఁచు నట్టి - ధీరుఁగొలుతు

౨౪

శ్రీరామ! నిఖిలేశ! చిన్మయాకార!
రమణీయ గుణతేజ! రాజీవనేత్ర!
సీతామనోహరా! శ్రితజనరక్ష!
రాక్షసనాశనా! రఘురామచంద్ర!
సర్వలోకశరణ్య! సచ్చిదానంద!
నీ పాదపద్మముల్ - నీలాభ్రదేహ!
చిత్తమందెంచెద - శ్రీ రామ! వరద!
తత్తరంబుల బాపి - దయఁబ్రోవుమయ్య!

౨౫

దశరథకులనాథ! శశిధరవదన!
కువలయ దళనీల! కోమలాకార!
అవనిజనాథ! పీతాంబరధారి!
చిఱునవ్వుమోమునఁ జిందులాడంగ
పలువిధభూషణావళులను దాల్చి
దివ్యరూపముతోడ - దేదీప్యమునగను
వెలుగొందు శ్రీరామ! విశ్రుత తేజ!
చెలువుగ వెలుగుమా - చిత్తమందెపుడు

౨౬

సజల జలదనీల! సన్ముని స్తోత్ర!
సుగమనిగమమూల! సుందరాకార!
రాక్షస సంహార! రణరంగధీర!
పక్షివాహనశౌరి! భక్తసంస్తుత్య!
దశరథ నృపబాల! ధర్మానురక్త!
లోకవిహార! సుశ్లోక సంస్తుత్య!
జానకీ వల్లభా! సత్కృపాపూర్ణ!

సేవింతు నిన్ను - నాచిత్తమందెపుడు
భావించి రక్షింపు - పంకజనేత్ర !

౮౭

దశరథ వరపుత్ర ! దానవజైత్ర !
దశకంఠ సంహార ! దక్ష ! శ్రీరామ !
కరధృతశరచాప ! కమనీయరూప !
ధరణిజనాథ ! పద్మదళాయతాక్ష !
మౌక్తికాలంకార ! ముక్తికారణుండ !
భక్తరక్షణధుర్య ! పతిత పావనుండ !
రఘుకుల శ్రేష్ఠ ! శ్రీరామ ! నీకగొల్తు
నఘములడించి, నెయ్యమున రక్షింపు

౮౮

వీరాసనమునందు - వెలసిన శ్రీరామ !
భాసమానస్వరూపా ! మహాత్మ !
రవినిభ తేజ ! నీరదనీలగాత్ర ! శ్రీ
వత్సచిహ్నముగల్గు పద్మనేత్ర !
కుండల ప్రభతోత - గండస్థలంబులు
మెఱయగా వెలుగొందు మేటివీర !
శ్రీనివాస ! ముకుంద ! శ్రీహరీ ! మందార
మాల, సింహాసనమునం బ్రశస్త
మగు, యలంకార భూషితమౌ, శరీర
శోభఁగల్గిన శ్రీరామ ! సుగుణభరిత !
అమరపతివంద్య ! నిన్ను నే ధ్యానయజ్ఞ
మున, నుతింతు ; రక్షింపుమా ! ముక్తి
వరద !

౮౯

శ్రీరామభద్రుని సేవించి భక్తి
నారాధనము సేయునట్టి సద్గురుల
పాదారవిందముల్ - భజియించు వారి
కాదరణంబులప్లైశ్వర్యభోగ
భాగ్యంబులారోగ్య భద్ర సౌఖ్యములు
యోగ్యతలబ్బు ; నీయుర్వినంత్యమున
నిత్య విష్ణుస్థాననియతి ప్రాప్తించు
సత్యమీ పల్కు - విచారంబువలదు.

౯౦

రణరంగ మందున - రావణు మర్దించి
ముల్లోకములకును - ముద మొసంగి,
సజ్జన మానస సంద్రంబునకు, శశ
ధరుఁడవై, సొబగుఁడై - దనరి నావు
రాజరాజుండవై - లక్ష్మణానుజునకు
నానందము నొసంగి - యలరినావు
సీతామహాదేవి చిత్తసాంద్రమునకు
పున్నమ చంద్రుఁడై పొలిచినావు
రాజరాజాత్మ చంద్ర ! శ్రీరామచంద్ర
మదరిపు మృగేంద్ర! నీ నామస్మరణమెపుడు
నాదుజిహ్వానల్పెడిగాత ! మోదమలర
జయములబ్బెడి సతతంబు - భయము
దొలఁగి.

౯౧

కోదండహస్తుండు కోమలాంగుండు
ఆపదలను బాపు - హరి, ముకుందుండు
నిశిత బాణంబుల - నిఖిలదైత్యాళి
నశియింపఁజేసిన - నారాయణుండు
శ్రీరామ మూర్తి - యాశ్రితకల్పవల్లి
నారాధన మొనర్తు - యహరహంబేను.

౯౨

ధరణిజ, విభుండె - పరమాత్మ తత్త్వ
మంచు
నెఱుఁగఁజాలకుండిన - దోసమింత లేదు ;
అతని తత్త్వంబు సేవించు - నవనిజనుల
నరయు, యమదూత లేమి సేయంగ లేరు.

(సశేషము)

# సమత్వాదర్శముగూర్చి మరికొన్ని విషయాలు

బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

  

ఇందలి 5 వ వ్యాసములో మన సంఘమునందలి స్త్రీ పురుషులలో సమత్వాదర్శ విషయమై కొంత వరకు చర్చించియుంటిమి. మన నారీలోకమునకు సంబంధించిన ముఖ్యసమస్యలకు పోకపూర్వమీ "సమత్వ" విషయమై మరికొంచెము పరిశీలించుట యవసరము.

దైవసృష్టిలో స్త్రీ పురుషుడు, పిపీలికాది సమస్త జీవరాసులును బ్రహ్మస్వరూపులే - ఎల్లరకు మోక్షార్హత కలదు - ఎల్లరను సమానదృష్టితో జూడవలెను - అను హాంశము తత్త్వరూపేణ నిర్వివాదాంశము. కాని ఆచరణలో మాత్రము మనదేశమందేగాక యితర దేశములలోగూడ విద్యవిషయమై, ఉద్యోగముల విషయమై వివాహాది హక్కుల విషయమై, జీవితావకాశముల విషయమై, సాంఘికాచారముల సందర్భమున, స్త్రీలను వెనుకబడినజాతిగ జూచుట పరిపాటియైపోయినది. ఈ అసమానత్వము మనదేశములో యిటీవల మరింత హెచ్చుపెరిగిపోయి, స్త్రీలు పురుషులకు దాదాపు ఛాయామూర్తులై పోయిరని చెప్పవచ్చును. ఈ దుస్థితిని తొలగించి, తిరిగి స్త్రీలకు వలయు సంపూర్ణ స్వేచ్ఛ, జీవితావకాశముల నొసంగుటకై భారతరాజ్యాంగము కొన్ని ప్రత్యేక సూత్రములను శాసించెను. అందుకనుగుణ్యముగ కేంద్రసాంఘిక సంక్షేమ బోర్డును, రాష్ట్ర ప్రభుత్వములును కొన్ని ప్రత్యేక ప్రయత్నములు చేయుచున్నను ఇచ్చటి మూలసమస్య ప్రజాజీవితసమస్య - లేక మతసమస్య యగుటచే కేవలము యీ ప్రభుత్వ శాసనములు, బోర్డు నిర్ణయములతో అసలు రుగ్మత పూర్తిగా కుదురుట అసంభవము. ఇందుకై గాఢమగు ధర్మచికిత్స అవసరమని నేను లోగడనే వ్రాసియుంటిని.

ఒకవిధమున జూచినచో యీ అసమానత్వమే ప్రకృతిసిద్ధమా? యని ఒక్కొక్కప్పు డనిపించును. ఏలయన, యీ మహావిశ్వమందలి అనంతకోటి జీవరాసులలో యే రెండు జీవులును ఒకేరూపము, గుణము, శీలము, వైఖరి కలిగియుండవు. అదేమి చిత్రమో! యిన్నికోట్ల జీవులందును అన్నికోట్ల భిన్నవ్యక్తిత్వము లగుపడును! అన్న తెలివితేటలు తమ్మునికి ఉండవు. తమ్ముని దేహదార్ఢ్యము అన్నకు లేకపోవచ్చును. తండ్రి పండితుడు - పుత్రుడు పరమశుంఠ! పశుపక్ష్యాదులలోను, మానవులలోను అనేకవిధములైన గుణభేదములు, పద్ధతి భేదములు మనము నిత్యము కనిపెట్టుచునేయుందుము. శాస్త్ర నిబంధనలు, ఆచారాలు, అలవాటుల మాట అటుంచి; స్త్రీ పురుషులలో కొన్ని భేదాలు సహజంగానే అగుపడతాయి - మనదేశంలోనే కాదు - ప్రపంచమంతటిలోనూ కూడా అంతే. ఈ భేదాలు కొంతవరకు కృత్రిమమని మనం అంగీకరించినా, కొంతవరకు సహజమైనవని తోస్తుంది. ఉదాహరణ: యుద్ధోన్మత్తులలో బహుసంఖ్యాకులు మగవారు - శాంతికాములలో ఆడవారు హెచ్చు. ఆ మాటకు వస్తే, అసలు దండమే పురుషుడు - అహింస స్త్రీ లక్షణమనికూడా వ్రాసెను. అందుచేతనే ప్రతిసేనలోనూ ఒక్క మగధీరులే ఉండడమున్నూ, గాంధీగారి సత్యాగ్రహంవంటి ఉద్యమాలలో ఆడవాళ్లు హెచ్చుగా చేరడమున్ను తటస్థిస్తూంది. దీని మూలతత్వానికి వెళ్ళితే యీ స్త్రీత్వ, పుంసత్వతత్వాలు రెండూ రెండు భిన్నతత్వాలుగానే అగుపడతాయి. అయితే యిందలి వైచిత్రమేమంటే, యీ రెండు ప్రకృతులూ కొంచెముగనో, గొప్పగనో ప్రతి మానవునిలోనూ ఉంటాయట. మగవానిలో పురుషప్రకృతి మెండు - ఆడుదానిలో స్త్రీ ప్రకృతి హెచ్చు. మంత్రశాస్త్ర, వైద్యశాస్త్రములనుబట్టి ప్రతివానిలోను కుడివైపు పురుషప్రకృతి, ఎడమ భాగంలో స్త్రీ హాంశయు ఉంటాయని మనం గ్రహించవచ్చును. శివశక్తులలో శివుడు కుడివైపు, శక్తి ఎడమభాగంలోను ఉంటారుట. అందుచేతనే, నాడీనిదానంలో స్త్రీలకు ఎడమచేయి, పురుషులకు కుడిచెయ్యి పరీక్షచేస్తారు. సంప్రదాయం తెలిసిన వారు భార్యాభర్తలలో భార్యను యెడమవైపు, భర్తను కుడివైపు కూర్చోబెట్టిస్తారు. ఆడవాళ్ళలో ఎడమచేతివాటం హెచ్చు. పురుషులకు కుడిచేయి

అలవాటు యెక్కువ. ఇంకొక విచిత్రమేమంటే, అనిబెసంటువంటి విపరీత స్త్రీలలో పురుషాకారం హెచ్చుగా ఉంటుందిట. అట్టివారు కుడిచేతితో అవలీలగా టెన్నిస్ ఆడగలరు - రాజకీయాలు వారికి మోకాలుబంటి. ఇట్లనే పురుషులలో ఎడమచేతి వాటం కలవారుకూడా ఉంటారు. వారిలో స్త్రీత్వాంశ యెక్కువని మనం తేలికగా గ్రహించగలం. అట్లాటివారు (ఉద: రవీంద్రనాథ ఠాగూరు) తరుచు రాజకీయాలకిరారు. కళలతోను కవిత్వంతోను కాలక్షేపంచేస్తూ ఉంటారు. స్త్రీలలో యెక్కడో ఒక సత్యభామ, రుద్రమదేవి, ఝాన్సీలక్ష్మీబాయివంటి వారికి దక్క రణక్రీడలంటే రుచించవు. గాంధీగారు పాతికేండ్లు దేశమంతా గాలించి, నానాఅవస్థలూ పడితే, తన సంపూర్ణ అహింసాపద్ధతికి ఒక్క వినోబాభావే తప్ప మొగాడే దొరకలేదు! ఇదే విధంగా, పిల్లలను సాకడంలోను, పెంచడంలోను, గృహకృత్యనిర్వహణములోను, స్త్రీలది అందెవేసిన చెయ్యి. ఎక్కడో నలభీమపాకాలని కబుర్లు చెప్పటమే కాని, వంటవిషయమైకూడా అంతేనని తోస్తుంది. కాని హెచ్చు శారీరకశ్రమ కావలసిన సత్రం వంటలలో మాత్రం మగవాళ్ళే కావలసి వస్తున్నారు. పొలందున్నుట, చెట్లుకొట్టుట, దుంగలు మోయుట, పడవ లాగుట, రిక్షా లాగుట మొదలైన యెక్కువ శారీరకకష్టం కలిగిన పనులన్నిటిలోను మగవాళ్ళే అగుపడుతారు. స్త్రీలకు అలంకార ప్రియత్వము పురుషులలోకంటె హెచ్చు. పురుషకల్పితమైన శాస్త్రములు చాలవరకు స్త్రీలకు వ్యతిరేకించినా, విద్యావిషయమునను, ఆర్థికవిషయమందును, తుదకు పరిపాలనా విషయమందును క్రమముగ స్త్రీలు తమ అర్హతను, సామర్థ్యమును ప్రదర్శించుకొనుచున్నారు. అయినప్పటికీ వారిలోని సహజభేదం అట్లనే ఉంటుంది.

ఈ ప్రకృతి భేదములో మనము గమనించవలసిన విషయములు రెండు కలవు (1) సహజముగ స్త్రీపురుషులలో యిట్టి భిన్నప్రకృతులున్నను, తమ నిజప్రకృతికి అంతరాయము కలిగినప్పుడు ఆయా స్త్రీపురుషులలో మారుప్రకృతులే వృద్ధిబొందును. ఎద్దుకు పిచ్చలు కొట్టినచో రోషము పోవునట. స్త్రీ "స్టెరిలైజ్" అయిన పురుష లక్షణములను బొందుటయే గాక మీసముగూడ వచ్చునట! (2) ఇక రెండవ విషయము నపుంసకులు, కొజ్జాల విషయము. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు స్త్రీలింగ, పుంలింగముల విషయమే గాని యీ నపుంసకలింగముల గురించి హెచ్చుగా పట్టించుకొనలేదు. కాని భారతీయ స్మృతులన్నిటిలో వీరి సహజగుణగణములు వీరవలంబింపదగు వృత్తులు, వీరిని వినియోగించవలసిన స్థలములు మున్నగునవన్నియు చక్కగా వర్ణించబడియున్నవి. ప్రజాజీవితమును చక్కగ ఖంజాయింపుచేసి నడిపించుటలో పాశ్చాత్యులకంటె మనవారే యెక్కుడు దిట్టలని రుజువు చేయుటకిదొక తార్కాణము.

ఇట్టి భిన్నప్రకృతులు కలిగియున్నను ప్రపంచ నాగరికతలో కారణాంతరములచే స్త్రీలకు సహజమగు అవకాశములే చాలచోట్ల కల్పింపబడకుండుట సామాన్యానుభవము — ముఖ్యముగా మనదేశములో. భారతదేశము మొత్తంమీద జూచినచో పశ్చిమ భారతిలో (బొంబాయి, గుజరాత్) శక్తిని లక్ష్మిగను, తూర్పు (వంగదేశము) భాగమున కాళిగను, దక్షిణాదిని హెచ్చుగ సరస్వతిగను ఆరాధింతురని చెప్పవచ్చును. కాని భారతస్త్రీలలో చాలమందికి ఆస్తిహక్కులు కాని, యుద్ధప్రవేశము కాని, విద్యార్హతగాని లేకుండుట మనమెరుగుదుము. ఇట్టి అసహజపరిస్థితినుండి తప్పించి, జీవితములో స్త్రీలకు తగు అవకాశములు కల్పించుట యిప్పటి సాంఘికోద్యమములయొక్క ముఖ్యలక్ష్యములలో నొకటియై యున్నది. ఇందుకు భారత రాజ్యాంగమును, ప్రభుత్వమును, కొంతవరకు దోహదమొసంగుచున్నవి. కాని అవకాశములతో సిద్ధికలుగునా? బడిలో వేయగనే బాలునకు "డిగ్రీ" లభించునా? ప్రస్తుత దైనందిన పోటీప్రపంచములో అవకాశములట్లనే ఉండును- ప్రతిచోటను అడ్డంకులు వాటంతట అవే ఉద్భవించుచుండును — చేనులోని కలుపుమొక్కలవలె! లేక యే మిడతలదండో, యే వరదలో, యే వర్షాభావమో, అసలు పంటనే నాశనమొనర్పవచ్చును. 30-40 ఏండ్లనుంచి దేశములో మహిళా ఉద్యమము నడచుచున్నది. కాని యెన్ని ఊళ్ళలో మహిళా సంఘము లేర్పడినవి? ఎన్ని సక్రమముగ పనిచేయుచున్నవి? మున్సిపల్ సంఘములలోను, గ్రామ పంచాయితీలలోను, స్త్రీలకు ప్రత్యేక స్థానములు "రిజర్వు" చేయబడినవి - వీరు యితర సాధారణ స్థానములకును దరఖాస్తు చేయవచ్చును. కాని యీ పదవుల నలంకరించినవారిలో యెందరు నారీమండల ప్రతినిధులు? ఎందరు పురుషులయొక్కయో, లేక

రాజకీయపార్టీలయొక్కయో "జేబులో బొమ్మలు"? బడులందును, కాలేజీలలోను స్త్రీ విద్యార్థినులకు విద్యార్థులతో సమాన ప్రవేశార్హత, జీతములలో కొంత సదుపాయముగూడ నున్నవి. కాని యిప్పటికి యెంతమంది విద్యార్థినులీ సదుపాయములను పొంద గలుగుచున్నారు? చదువుకొనువారికైనను అన్ని చోట్లను సరియగు గౌరవమర్యాద లబ్బుచున్నవా? కనీసము వీరి గురువులైనను వీరిని తమ బిడ్డలవలె ఆద రించుచున్నారా? ఇటులనే ఉద్యోగముల విషయమై ఆఫీసులలో, స్కూళ్ళలో, కాలేజీలలో, రైల్వే లలో, ప్రభుత్వేతర కార్యాలయములలో రష్యా, చైనాలవంటి విప్లవదేశములలో యీ విషయమై హెచ్చుమార్పులే వచ్చినట్లు పత్రికలు తెల్పుచున్నవి. కాని మనదేశములో మాత్రము ఏ కారణముచేతనైన నేమి? ఇంకను నూటికి ఒకటి రెండు వంతులైనను మార్పు ఉన్నటుల తోచదు. ఇక ఆస్తిహక్కుల విషయం పరిశీలి. యజమాని వీలునామా వ్రాయని స్థితిలో మాత్రమే స్త్రీ పురుషులకు ఆతని ఆస్తిలో సమానహక్కులు! దీనినిబట్టి ప్రతి గృహయజమానిని వీలునామా వ్రాసుకొమని ప్రోత్సహించుటయే గదా! ఫలితము? ఈ శాసనమువల్ల యెందరు స్త్రీలకు క్రొత్తగా ఆస్తులు సంక్రమించుచున్నవి? ఇందుకు మారుగ స్త్రీ పురుషులందరకు సమానహక్కులనో, లేక అన్నిహక్కులు ప్రభుత్వముకే అనో శాసిం చిన బాగుండిపోవునే!

ఇంతకును అవకాశములెట్టివైనను యీ స్త్రీ పురుష సమానత్వము విషయమై యిప్పటికంటె యెక్కుడుగ స్త్రీలలో చైతన్యమవసరము - స్వయం కృషి యవసరము - ఈ జీవితపోటీలో పురుషులు తమ మిరాశీలకై - తమ స్వంతహక్కులకై - పోరాడుచునేయుందురు-కృత్రిమశాసనములు చేయు చునేయుందురు. స్త్రీ అభ్యుదయమునకై యడ్డంకులు కలుగచేయుచునేయుందురు. ఇది సహజము. కాని పైనజెప్పిన విద్యావిషయములో - ఆర్థిక విషయము లలో - సాంఘిక విషయములలో - విజ్ఞాన విష యములో - స్త్రీలకిప్పటి దుస్థితి తొలగిపోవుట యవసరము. అప్పుడుకాని ప్రపంచరథము రెండు చక్రములపైనను నడువజాలదు. జీవయాత్ర సాఫీగా సాగుటకు వీలుకలుగదు. ఇందుకై పురుషుల సహాయ మెంతవరకు లభించును? కొంతవరకే! అందుచేతనే తమస్వీయాభ్యున్నతికై మన నారీలోకము తగినంతగ స్వయంకృషి యొనర్చుకొనుట అవసరము. ఏ పని కైనను ఎవ్వరికైనను, గీతలలో జెప్పినటుల :- "ఆత్మనో హ్యాత్మనో బంధుః ఆత్మన్యోరిపురాత్మనః" అనికదా! సూత్రము. ఈ లోకములో యెవరికివారే బంధువులు, వారే శత్రువులును. ఒకరి కర్మఫలము మరొక్కరికెటుల లభించును? పురుషుల పుణ్య ఫలములలో సగభాగము స్త్రీలకు లభించునని యొక విశ్వాసము మనలో నున్నది. స్త్రీలను పురుషులు న్యూనతతో జూడరాదనువరకు మాత్రమే యిందలి సత్యమును మనము గ్రహించవలయును. ఎన్నటికైనను స్త్రీ మోక్షము ఆమె చేతులలోనే యుండును. ఎచ్చటనైనను ఒకరె ప్రారబ్ధమున కింకొకరు కర్తలగు దురా? బాధ్యులగుదురా? సర్వకల్ల - మున్నాటికీ కల్ల!

ఈ సమానత్వ విషయమై మరొక్కమాట. ఈ ఆధునిక ప్రపంచములో యిదొక "హక్కు" విష యముగ పరిగణింపబడుచున్నది. నిజమే! పరులు మనను బాధించుచున్నంతవరకు - బంధించుచున్నంత కాలము - అట్టిపీడను, దాస్యమును తొలగించు కొనుట యెల్లరకు "హక్కే" - సందేహము లేదు. ఈ సూత్రము మన నారీలోకమునకును వర్తించును. కాని మరింత లోతుగ పరిశీలించినచో యిప్పటి పాశ్చాత్య "హక్కు శాస్త్రములు" చాలవరకు భ్రాంతియుతములనియు, మన జీవయాత్రలో మనకు కొంతవరకు మాత్రమే సహాయకారులగుననియు తేలి పోవును. ఇటీవల అమెరికాలో శ్రీ కృశ్చేవ్ ప్రసం గించుచు నల్లవారిలో, తెల్లవారిలోను ఒకేరక్తము ప్రవహించుచున్నందున అందరకు సమానత్వమే అవశ్యకర్తవ్యమని వ్రాక్రుచ్చెను. నిజమే. అందరి లోను ఒకేరక్తమున్నది. దానిరంగులో భేద ముండునో, లేదో మనము రూఢిగ చెప్పలేము - ఆ రక్తములోని భౌతిక రసాయనిక భాగములన్నియు ఒకేమాదిరి యుండునో, ఉండవో స్పష్టముగ తెలి యదు. గంగాజలములకును, గోదావరి నీటికిని చాల భేదమున్నదట. రెండింటి రసాయనిక భాగములు ఒకతీరైయుండవచ్చును. ($H_2O$) - రెండుపాళ్ళు హైడ్రొజెన్, ఒకపాలు ఆక్సిజెన్. కాని వీని గుణ భాగముల నెవ్వరైనను కాదనగలరా? ఈ మహా విశ్వమందలి ప్రతి అణువులోను అనేక మహత్తర శక్తులిమిడియున్నవని మనము ప్రత్యక్షముగ జూచు

చున్నాము. అట్టితరి, ఏ యిద్దరు జీవుల రక్తబిందువులలో నొకే స్వభావ, స్వరూపములుండుట సాధ్యమగునా? ఆయా బిందువులలో, నాయా జాతులలో, శతాబ్దములనుండి, వేలాది, లక్షలాది సంవత్సరములనుండి, సంక్రమించిన, వృద్ధిచెందిన, అనేక భౌతిక, వైజ్ఞానిక, ప్రాకృతిక, ఆధ్యాత్మిక శక్తులిమిడియుండవా? ఇటులనే స్త్రీ పురుష విషయమై కూడాను. స్త్రీ ప్రకృతి స్త్రీది – పురుష ప్రకృతి పురుషునిది. ఎవరి ధర్మనిర్వహణకై - యెవరి ఆత్మసిద్ధికై వారు కృషి యొనర్చుటొక్కటే యిందుకు కీలకము. ఈ రెండు ప్రకృతులలో స్వయం వైరుధ్యమెద్దియును లేనందున, మధ్యమధ్య చిన్న సంఘర్షణలను వినా, వీరిలో యెట్టి దీర్ఘపోరాటములకును తావులేదు. తుదకు యెల్లర గమ్యస్థానము నొక్కటే. ఏలయన, స్త్రీ పురుషులిరువురు ఒకే విశ్వమానవ మూర్తియొక్క భిన్నభాగములు. ఆ మూర్తియే మనకు మన శాస్త్రమందు జదువు అర్ధనారీశ్వరము. ఇందుగూర్చి విపులముగా వచ్చే అధ్యాయములో జదువుదము.

(సశేషము)

# తలనొప్పి, కన్నీరు



"మా పద్ధతి, వ్యాధిగ్రస్తునిలో ఉండే దుర్లక్షణాలన్నింటికి చికిత్స చేయడం. అంటే, అతడి ఉద్రేకాలు, నీరసత్వం, వ్యాధిలక్షణాలు మొదలైనవన్నీ" అని డాక్టర్ ఆర్నాల్డ్ పి. ఫ్రీడ్‌మన్ అన్నారు. ఆయన అమెరికా అంతటా పేరు ప్రతిష్టలు పొందిన మానసికతత్త్వైద్యుడు. ఇక్కడున్న మాంటిఫియోర్ హెడ్డేక్ క్లినిక్‌కు (తలనొప్పి వైద్యాలయం) ఆయన డైరెక్టరు.

ఈ వైద్యాలయాన్ని 1945 లో నెలకొల్పారు. అన్ని రకాల తలనొప్పి వ్యాధులకు చికిత్సచేసే అమెరికన్ ఆస్పత్రులలోకెల్లా ఇది పెద్దది. దీనిలో 14 మంది మానసిక వైద్యులు, సైకియాట్రిస్టులు (మానసిక తత్వవైద్యులు), అలెర్జిస్టులు (శరీర లోపాలు కనిపెట్టే వైద్యులు) ఎక్స్‌రే నిపుణులు, నర్సులు మొదలైన వారు పని చేస్తున్నారు. అమెరికను లేమి విదేశీయు లేమి దీనిలో చికిత్సపొందిన 10,000 మంది వ్యాధిగ్రస్తులలో నూటికి 90 మందికి తలనొప్పులు పోయాయి.

తలనొప్పులలో చాల వాటికి అసలు కారణం తలలో ఉండక మరెక్కడో ఉంటుందని ఆధునిక వైద్య పరిశోధకులు కనిపెట్టారు. దానిని ఆధారంగా తీసుకొని ఇక్కడి వైద్యులు చికిత్స చేస్తారు. "మా దగ్గర కొచ్చే వ్యాధిగ్రస్తుల మస్తిష్కాలకే కాకుండా దేహాలకు కూడా చికిత్సచేస్తాం" అని డాక్టర్ ఫ్రీడ్‌మన్ "న్యూస్ వీక్" పత్రికలో వ్రాసిన వ్యాసంలో పేర్కొన్నారు.

తలనొప్పి అనేది ప్రత్యేకం ఒక వ్యాధి కాదు. మానసికంగా ఏదైనా బాధ ఉండడంవల్లనో, శరీరంలో మరొక రుగ్మత ఉండడం వల్లనో లేదా రెండింటి వల్లనో తలనొప్పివస్తుంది. అందుచేత అదొక సూచన. అందు అసలు కారణాల్ని కనిపెట్టడానికి విపులంగా పరిశోధనలు జరిపారు.

తలనొప్పి రావడానికి అసలు కారణమేమిటో తెలుసుకొనేటందుకు వ్యాధిగ్రస్తునిమీద ప్రశ్నలవర్షం కురిపిస్తారు. ఎటువంటి ప్రశ్నలంటే "సరిగ్గా ఎక్కడ నొప్పెడుతూంది? నుదురు దగ్గరా, తలపైనా, వెనకవైపునా? సాధారణంగా ఏ సమయంలో నొప్పి ప్రారంభమవుతుంది? చటుక్కున తగ్గిపోతుందా, లేక క్రమంగా తగ్గుతుందా? విపరీతంగా శ్రమ తీసుకొన్నప్పుడుగాని, ఏదైనా తిన్నప్పుడు గాని ఎక్కువవుతుందా? తలనొప్పితో పాటు వాంతులు, చెవులో హోరు, కళ్లు చీకట్లు కమ్మడం మొదలైన వేవైనాకూడా వస్తాయా?"

ప్రతి వ్యాధిగ్రస్తుని కూడా రక్తపరీక్ష మొదలు మస్తిష్కాన్ని ఎక్స్‌రే తీయడం వరకు పూర్తిగా శరీర పరీక్షచేస్తారు. ఆస్పత్రిలో ఉపయోగించే అత్యాధునిక వైద్యశాస్త్ర పరికరాలు తలలో రక్త ప్రసారం ఎలా జరుగుతున్నదీ, నరాల

కదలికలు ఎలా జరుగుతున్నదీ, తలలోని రక్తనాళాలు ఎలాపనిచేస్తున్నదీ మొదలైన వన్నీ కనిపెట్టివేస్తాయి.

ఈ విధంగా వ్యాధి గురించిన సమస్త విషయాలను కనిపెడతారు. వ్యాధిని నయంచేయడానికి యాస్ప్రిన్ మొదలైన ఔషధాలను వాడుతారు. గాని పూర్తిగా నయం కావడానికి వ్యాధిగ్రస్తు నిబ్బరం, వైద్యునిలో వ్యాధిగ్రస్తుని నమ్మకం ముఖ్య విషయాలు. తలనొప్పికి ఏది అసలు కారణమని వైద్యులు తలుస్తారో దానికి చికిత్స చేస్తారు.

తలనొప్పులను నయం చేయడంలో ఈ వైద్యుల పరిశోధనల వల్ల చాలా అభివృద్ధి అయినప్పటికీ, ఈ పరిశోధనలు మెల్ల మెల్లగా జరుగవలసిందేగాని శీఘ్రంగా జరుగడానికి సాధ్యపడదంటారు. ఎందుకంటే, కోతులు మొదలైన ప్రయోగాత్మక జంతువులకు తలనొప్పి తెప్పించడం అసాధ్యం. అందు చేతనే, తలనొప్పి ఉన్న వ్యాధిగ్రస్తులు వచ్చినప్పుడు మాత్రమే పరిశోధనలు జరుపడం వీలవుతుంది.

♦ ♦ ♦

## కంటికి కన్నీటి అవసరం

భారతదేశంనుంచి వచ్చి ఇక్కడ కంటినిగురించి పరిశోధనలు చేస్తున్న ఒక యువ డాక్టర్ కృషి ఫిలడెల్ఫియా ఇంక్వయరర్ పత్రిక దృష్టిని ఆకర్షించింది.

పదిలక్షలకు పైగా ప్రతులు అమ్ముడు పోయే ఈ పత్రిక వారసంచికలో "భారత దేశానికి నేత్రాలు" (ఐస్ ఫర్ ఇండియా) అనే శీర్షిక క్రింద ఈ డాక్టర్ నరేంద్ర కృషిని వివరించే వ్యాసం ప్రచురించబడింది. డాక్టర్ నరేంద్రకృష్ణ ఒక రోగి కంటిని పరీక్షిస్తుండగా తీసిన చిత్రం కూడా వ్యాసంతోపాటు వేశారు. ఆ వ్యాసం పూర్తిగా ఈ క్రింద ఇవ్వబడింది.

డాక్టర్ నరేంద్ర కృష్ణను మొదట చూచినప్పుడు - రెండోసారి చూచినప్పుడైనా సరే ఆయన కన్నీటినిగురించి పరిశోధన చేస్తున్నాడని ఎవరైనా ఊహించడం కష్టమే. ఎప్పుడూ ఉల్లాసంగా చిరునవ్వుతో కనుపించే ఈ స్నేహశీలికి అసలు దుఃఖం అంటే ఏమిటో తెలుసునా అనిపిస్తుంది. మనసారా నవ్వేనవ్వుకి, దుఃఖానికి ఎంతదూరం ఉంటుందో డా. కృష్ణకి దుఃఖానికి అంతదూరం ఉంటుంది.

అయితే డాక్టర్ కృష్ణకి కన్నీటికీ ఉన్న సంబంధం పూర్తిగా శాస్త్ర సంబంధమైనది. పిల్సుకంటి ఆస్పత్రిలో కంటిని గురించి ఆయన చేసిన పరిశోధనలో బాగుగా కన్నీటి పరిశీలనచేశాడు. నేత్ర వైద్య శాస్త్రానికి కన్నీరు అతి ముఖ్యమైంది. ఎల్లప్పుడూ కనుగ్రుడ్డు చుట్టూ కన్నీటి తేమఊరుతూ ఉండకపోతే కన్ను పనిచేయదు. మానవ నేత్రానికి సంబంధించిన ఆరోగ్యం డాక్టర్ కృష్ణకు ప్రధాన ఆసక్తిగల శాస్త్ర విషయం.

స్వదేశంలో వైద్య కళాశాల పట్టభద్రుడైన డాక్టర్ కృషి కంటి జబ్బుల పరిశోధనకు పూనుకున్నాడు. ఈ పరిశోధనలు సాగించటానికి 1955 లో ఆయన అమెరికా వచ్చాడు. అమెరికాలో అదృష్టవశాత్తు

నేత్రవైద్య శాస్త్రానికి సంబంధించిన ఒక జాతీయ సంస్థలో డాక్టర్ కృష్ణకి సంబంధం ఏర్పడింది. అంధత్వ నిర్మూలనకు కృషి చేసే సంస్థ ఇది.

దీనిని "సైట్ ఫర్ సైట్" సంస్థ అని అందరూ అంటుంటారు. డాక్టర్ కృష్ణకి ఈ సంస్థ మొదట ఒక ఫెలోషిప్పు గ్రాంటు ఇచ్చింది. దీని సహాయంతో ఆయన పెన్సిల్వేనియా యూనివర్సిటీకి వెళ్లాడు. మళ్లీ, ఈ సంవత్సరం ఈ ఇండియన్ డాక్టర్‌కి "సైట్ ఫర్ సైట్" సంస్థ ఒక పరిశోధన గ్రాంటు ఇచ్చింది. దీనిలో డాక్టర్ కృష్ణ కనీసం వచ్చే వేసవి దాకా ఫిలడల్ఫియాలో పరిశోధన కృషి సాగిస్తారు. ఆ తరువాత స్వదేశానికి వెళ్ళి వైద్యశాస్త్ర అధ్యాపకుడుగా చేరాలనుకుంటున్నారాయన.

"భారతదేశంలో కంటి జబ్బులు అమెరికాలోకంటె పదిరెట్లు హెచ్చుగా వస్తుంటవి. మా లెక్కలు అంత ఖచ్చితమైనవిగావు. ఆయన ఈ సమస్య పరిమాణం తెలుసుకోటానికి అమెరికన్ లెక్కలతో పోల్చి చూచుకోనేటందుకు ఇవి పనికి వస్తవి. ఉదాహరణకు అమెరికాలో చూపు మాంద్యాల కలవారు 7,00,00000 మంది ఉన్నారు. అందులో 3,44,000 మంది అంధులు. 40 ఏళ్లు దాటిన ప్రతి 50 మందిలో ఒకరికి గ్లకోమా ఉన్నది. అయినా నూటింట 70 మందికి దృష్టిలోపాన్ని ముందుగా పరిశీలించి, చికిత్స, పరిశోధనల వల్ల నివారించటానికి అవకాశం ఉన్నది" అని డాక్టర్ కృష్ణ అన్నారు. సైట్ ఫర్ సైట్ (అంధత్వ నివారణ సంస్థ) చేస్తున్న పనికూడా ఇదే. ఈ సంస్థ 1946 లో ఏర్పాటయింది. ఇప్పటికే ఈ సంస్థ నేత్ర వైద్య పరిశోధనలకు 3, 10,00,000 గ్రాంట్లు ఇచ్చింది. అమెరికాలో 23 రాష్ట్రాలకు, 7 విదేశాల పరిశోధకులకు, పరిశోధన సంస్థలకు ఈ 30,00,000 గ్రాంట్లు లభించినవి. 66 కు పైగా పరిశోధన కేంద్రాలు, ఆస్పత్రిలు, యూనివర్సిటీలు, వైద్యవిద్యాలయాలు ఈ సహాయం పొందినవి.

అట్లా ఈ సంస్థ గ్రాంట్లు లభించిన వారిలో 30 సంవత్సరాల యువకుడైన డాక్టర్ కృష్ణ ఒకరు. "నేను ఇక్కడకు వచ్చినప్పుడు ఆరేళ్లు పరిశోధన, విద్యాభ్యాసం జరిపే అవకాశం లభిస్తుందని నేనెప్పుడూ ఊహించనైనా లేదు. నా రెసిడెన్సీ పని పూర్తిచేసుకుని వెళ్ళిపోదామనుకుని వచ్చాను. అయితే ఇప్పుడిక నా రంగంలో మరింత హెచ్చు శక్తి అనుభవాలు గడించుకుని ఈ రంగంలో ఇతరులకు శిక్షణ గరపటంలో తోడ్పడగల విధంగా తయారై వెళ్లుతున్నాను" అన్నారాయన.

# స్వీకారం

"రాఘవ"

(గతసంచిక తరువాయి)

పార్వతికి మాత్రం అత్తగారి మాటల్లోగల అర్థాన్ని అవగాహన చేసుకొంటున్నకొద్దీ, సావిత్రి ముఖంలో నిరాశాభావంతప్ప వేరే యింకోటి కనిపించటంలేదు. భవిష్యత్‌లో సావిత్రికి గల్గబోయే అన్యాయం ఏరూపంలో వుంటుందోనని భావించసాగింది. ఉన్న ఒక్క కూతురికి న్యాయ్యం చేకూర్చలేకపోతున్నానే అనే దుగ్ధ — ఆదుర్దా హెచ్చుకాసాగింది. ఉన్న ఒక్క కూతుర్ని యిలా పరాయిగా యిచ్చి, బాధలో పడేసి, దిక్కులేనిదాన్నిగా చేసి, ఏడిపించటం తన మాతృత్వంపట్ల తగినపని కాదనుకొని విచారించింది. హృదయం యీ సమస్యతో కల్లోలితమైంది. ముఖంలో దైన్యం ప్రస్ఫుటమవుతోంది. దిక్కుతోచక పార్వతి బెంబేలుపడటం సావిత్రి గ్రహించింది. ఒకప్రక్క నాయనమ్మ మాటలు బాధాకులితమై సావిత్రిని కలవరపరుస్తున్నాయి. మరోప్రక్క పార్వతి దీనస్థితి చూస్తుంటే సావిత్రికి కళ్లు చెమ్మగిల్లుతున్నాయి.

కాంతమ్మ, సీతాపతి యింకా అప్పటికి పెళ్లి ప్రస్తావన సాగిస్తూనే వున్నారు. పార్వతి, సావిత్రి పరితాపంలోనూ — సందేహాల్లోనూ — మునిగితేలుతున్నారు. చివరకు సంభాషణను సాగదీసి — సాగదీసి కాంతమ్మ రెచ్చిపోయింది. సీతాపతికి విసుగెత్తిందేమో! వున్నట్టుండి — "ఇంతకీ నన్నేం చేయమంటావ్?" అని దులపరించుకొంటూ భారమంతా కాంతమ్మ నెత్తిమీదికి తోసేసాడు.

అంతవరకూ మామూలుగా కూర్చున్న కాంతమ్మ, సీతాపతిని అనునయపరుస్తూ, దగ్గరగాచేరి —

"కాస్త నే చెప్పేది బాగా విను. అనవసరంగా అప్రతిష్ఠలపాలుకాకు. పెద్దదాన్ని ఏదో చెబుతున్నానని పెడచెవిని పెట్టకు. తీరా రసాభాస అయిన తరువాత నాలిక్కరుచుకొని పశ్చాత్తాపంపడినా ప్రయోజనంలేదు. ముందే జాగ్రత్తపడటం యిలాంటప్పుడు యెందుకైనా మంచిది. తెలుసా!" — అన్నది. సీతాపతి విసుక్కుంటూ —

"చెప్పేదేదో సూటిగా చెప్పరాదూ! ఎందుకీ డొంకతిరుగుడు మాటలు" — అన్నాడు.

"డొంకతిరుగుడు కాదురా! యింతలోకీ అన్నీ విసుగెందుకూ! నేనేం పరాయిదాన్నటరా! నినుత మభ్యపెట్టడానికి కల్లబొల్లి మాటలతో. దూరమాలోచించి చెబుతున్నాను. మనవాళ్లలో ఎవరెటువారైందీ యింకా నీకు తెలియదు. అంతా మంచివాళ్లలాగే కనిపిస్తూ మాట్లాడుతారు. అంతమాత్రానికి వాళ్ళని నమ్మితున్నామో — కొంప మునిగిందే! కాబట్టి అనవసరంగా ఋర్ర పాడుచేసుకోక, చెప్పేదు మాటలు వినక, నే చెప్పినట్లు చెయ్యి" — అని సీతాపతికి ఒక ప్రయత్నాన్ని కల్పిస్తూ—పురిగొల్పింది.

తల్లిమాట ప్రకారం, సీతాపతి చటుక్కున కూర్చున్నవాడల్లా లేచి, పంచాంగం తెచ్చి, గబగబ పేజీలు తిరగవేయడం ప్రారంభించాడు. 'మంచిరోజు ఎప్పుడా?' అని కాంతమ్మ ఆలోచిస్తోంది. సీతాపతి ఒక పావుగంటసేపు పంచాంగం పరిశీలించి రెండు మూడు రోజుల్లో బయలుదేరటం మంచిదన్నాడు. కాంతమ్మ జాగ్రత్తగా వెళ్ళి సంబంధాన్ని నిశ్చయంచేసుకొని రమ్మంది.

తీరా వెళ్ళవలసినరోజు వచ్చింది. సీతాపతి ఆనాడు సాయంత్రం బండికి వెడదామనుకొన్నాడు. కాంతమ్మ యీ రెండు రోజులూ సీతాపతికి చెప్పిందే చెప్పి విసుగెత్తించింది. పార్వతితో మళ్లా యేదైనా సంప్రదించి, తనమాటని నిర్లక్ష్యంచేస్తాడేమోనని, సీతాపతిని ఒంటరిగా వుండనీయక చెంగునకట్టుకొని త్రిప్పింది. అలా రిక్షా ఎక్కేవరకూ వుంచుతూనే వుంది. సీతాపతి రిక్షా ఆ వీధిమలుపు తిరిగేంతవరకూ వెంటవచ్చి — "నీ ప్రయత్నం నువ్వు మనస్ఫూర్తిగా

చెయ్యి. మిగతాదానికి భగవంతుడే వున్నాడు" — అని రిక్షాని స్టేషన్‌వైపుకి సాగనంపింది.

సీతాపతి రిక్షా దిగీదిగటంతోనే, కళ్ళు చెమ్మగిల్లినయి. పార్వతి గుర్తుకొచ్చింది. సావిత్రి — 'నాన్నా' అని వెనుకవైపునుంచి వచ్చినట్లు ఆలాపన. హృదయం ఎందుకో, తరుక్కుపోతున్నట్టుగా వుంది. టికెట్టు తీసుకొన్నాక, సీతాపతి స్థిమితంగా వెళ్ళి ఒక బెంచీ మీద చతికిలపడి, యోచించుకోసాగాడు — బండి రావడానికి యింకా అరగంట ఆలస్యంవుంది. "అమ్మమాటకి ఎదురుచెప్పలేక, అసమర్థుడిలా ప్రవర్తించాను. వచ్చేముందైనా తన ప్రయత్నాన్నిగూర్చి చెప్పకుండా, పార్వతిని కష్టపెట్టానే! నేనెంత పక్షపాతం గలవాడిలా ప్రవర్తించాను! కన్నకూతురి మనస్సెలాంటిదో తెలుసుకోకుండా బుడాబుడావచ్చి టికెట్టుకొన్నాను. నేను నిజంగా ఎంత తెలివితక్కువపని చేశాను. భార్యకు — కూతురికి తెలియకుండా యీ ప్రయత్నం సఫలీకృతం గావించుకొనివచ్చి, బలవంతంగా వొప్పింపచేయటం కాదు అన్యాయమే గదూ! నేను నిజంగా తండ్రిగా వ్యవహరించటం లేదేమో!" — అని యిలా పరిపరివిధాలుగా తనలో తాను వితర్కించుకోసాగాడు.

ఇంతలో బండి వచ్చింది. బాధాస్వాంతనంతో సీతాపతి మూడోక్లాసు పెట్టెలో ఎక్కి కూర్చున్నాడు. బండి నెమ్మదిగా కదిలింది....

ఆనాటి రాత్రి శాంతమ్మ ఒక్కతే బిక్కుబిక్కుమంటూ పోయి వేరేగదిలో దర్జాగా పడుకొంది.

పార్వతి — సావిత్రి మాత్రం ఒకేగదిలోకిచేరి, సీతాపతి చేసుకొనిరాబోయే ప్రయత్నాన్ని పురస్కరించుకొని మాట్లాడుకోసాగారు. పార్వతి యెంతో దిగులుపడి దిగ్భ్రమింగుకొని సావిత్రిని అనునయపర్చటం మొదలెట్టింది. కాని సావిత్రి, తల్లి మాటని కాదంటూ వుద్రిక్తంగా మాట్లాడటం ప్రారంభించింది. పార్వతి, యిక యేం మాట్లాడాలో తెలియని స్థితిలో వుండగా —

"నన్ను చివరకు మీరంతాకలిసి పరాయివాడికప్పగిస్తారని యెన్నడూ కలలోకూడా అనుకోలేదు. కని — పెంచి — చదువుచెప్పించి పెద్దదాన్ని చేశారు. యెందుకూ — ఏడిపించడానికేగా! ఒక్కగానొక్క ఆడపిల్లనైనందుకు, కొంతగాకపోతే కొంతవరకైనా, నా వ్యక్తిగతాభిప్రాయంలో స్వేచ్ఛనిస్తారేమోనని ఆశపడ్డాను. నా జీవితం సుఖవంతంగాచేసి తీరుతారనే యింతవరకూ ఆశిస్తూవచ్చాను. చివరకు నువ్వైనా కల్పించుకొని నాన్నతో నా వుద్దేశ్యాన్ని చెబుతావేమో ననుకున్నాను. మనస్ఫూర్తిగా వువ్విళ్ళూరిపోయాను తప్పకుండా తెలియపరుస్తావని. తీరా బయలుదేరేంతవరకూ వేచివున్నాను. చెప్పకుండా వూరుకొన్నావ్. కనీసం నన్నైనా చెప్పమని గుర్తుచేయలేదు. నా మనస్సులోగల వుద్దేశ్యాన్ని ఆనాడే నీకు చెప్పానుగా! అంతావిని సరేనన్నావుగా! అమ్మా!" —

పార్వతి యీ మాటలు వింటూ కన్నీరుకార్చటం మొదలెట్టింది.

"అమ్మా! నువ్వు అనవసరంగా యిప్పుడేడ్చి యేమిటీ లాభం? నిజంగా నామీద నీకు ప్రేమే వుంటే, నాన్నతో యీ విషయాన్ని చెప్పటానికి జంకుతావా? అమ్మా! నేను మురారిబావను కోరి పెళ్ళి చేసుకుంటాననటం తప్పేనంటావా? మీకిష్టం కదా? నేనిలా పెళ్లి చేసుకుంటాననటం! యీడైనవాడనీ, చదువుకున్నవాడనీ, ఎన్నోసార్లు నువ్వే అన్నావ్‌గదా! యీనాడు ఆ వాత్సల్యపూరితమైన మాటలన్నీ, నాన్నముందు ఏమైపోయినయి? నా జీవితానికి మేలుచేయాలని మీకెప్పుడూ లేదని గ్రహించాను. నీకు మేనరికం కలుపుకోవాలనివుంటే, యిలా చేస్తూవుంటే, చూసి వూరుకోగలవా అమ్మా! అయినవాళ్ళలో వున్న సంబంధబాంధవ్యాలను తెగ త్రెంపులు చేసుకొని, నా మనస్సులో చిచ్చుపెట్టి, మేనరికాన్ని వదిలి, నాకు మురారిబావను దూరం చేసి, నేను పరాయిదానిగా సంసారంచేస్తూ, యమయాతనలను అనుభవిస్తూండడం మీకిష్టమా! అమ్మా! నా జీవితాన్ని యెందుకిలా తయారుచేయాలనుకొంటున్నారు? నన్ను పరాయివాడికిచ్చి, మీరు పొందేసుఖం యేమిటి?" — అని సావిత్రిని చిత్రవధ చేస్తున్నట్లుగా మాట్లాడేసింది. పార్వతికి సావిత్రిలో యింత వుద్రేకం వుందని తెలియదు. చేసేదేంలేక, కూతుర్ని దగ్గరకు తీసుకొంటూ —

"నేను నీకేం అన్యాయమూ చేయటంలేదు. ఒకరితో చేయమనీ చెప్పటంలేదు. నా స్థితి యెలాంటిదో యింకా నీకు తెలియదు. యిలాంటి సమయంలో నేనేది అన్నా, పరిస్థితులు యింకా ఘోరంగా పరిణమిస్తయి. అన్నిటికీ ఆ సర్వేశ్వరుడే వున్నాడు. మనం చేయగల్గిందేంలేదు. నువ్వనవసరంగా వుద్రేకపడకు, ఆడదానికి అసలు వుద్రేకం వుండగూడదు" — అని కళ్లు తుడుస్తూ, సావిత్రిని ఓదార్చింది.

అప్పటికి గడియారం పదకొండు గంటలు కొట్టింది. వర్షం సందెవేళనుంచి కురిసి, కురిసి, యీదురుగాలితోపాటు ఆగిపోయింది.

సావిత్రిని నిద్రపుచ్చేసరికి, పార్వతికి పెద్దలు దిగొచ్చారు. కాని, పార్వతికి మాత్రం నిద్ర తేలిపోయింది. సావిత్రి అన్నమాటలు పుంఖానుపుంఖంగా గుర్తుకొస్తుంటే, గుండె ద్రవీభూతం అయిపోసాగింది. తనకితాను ఎంత ఓదార్చుకున్నా ప్రయోజనం శూన్యమనిపించుతోంది. చేతులారా కన్నకూతురు గొంతు నులుముతున్నానే అని క్షోభించింది. తనకీయింట్లో ఏమాత్రమూ స్వేచ్ఛా - స్వతంత్రమూ లేకపోయింది కాబట్టే, సావిత్రి యీ గతికి వచ్చిందని కకావికలపడసాగింది. పరాయిసంబంధం చేసినందువల్ల, అమ్మలక్కలూ - బంధువర్గం - వేళాకోళాలతో వెక్కిరిస్తారేమోనని భయపడటం మొదలెట్టింది. భర్తమాట కాదని తనేం చెప్పగలదు? అత్తగారి మాటకు అడ్డువచ్చి గెల్చేదెట్లు? కన్నకూతురివల్ల తనకెలాగూ తీరని ముచ్చ - కోరని అవమానం ప్రాప్తమవుతోయని నిశ్చయించుకొంది. నేనే సావిత్రి జీవితాన్ని-సుఖాన్ని-భగ్నపరచి, అన్యాయం చేశానని లోకం తప్పకుండా అనుకొని, తిట్టిపోస్తుందని నిర్ధారించుకొంది. పార్వతికి యింతేగాకుండా యింకా కొన్ని ఆలోచనలు కల్గినయి.

మురారిమీద సావిత్రికి మనసు కుదరటంలో ఆశ్చర్యమేమీ కలగలేదు. సావిత్రి యిందులో చేసిన తప్పేమీలేదని తెలుసు! కల్గిన వ్యక్తిగతాభిప్రాయాన్ని వెళ్ళబుచ్చినా ప్రయోజనం ఏమిటీ! ఎలా సాధ్యపడుతుంది. సావిత్రి కోర్కె ఎలా తీరుతుంది? తను తీర్చలేదు, యింకెవరూ తీర్చేది? యింకెప్పుడు తీరుస్తారు? అసలీ విషయాన్ని భర్తకిగానీ, అత్తగార్కిగాని తెలియపర్చేదెవరు? తనకా వాక్స్వాతంత్ర్యంలేదు. యింకెలా సావిత్రి బాగుపడేది? సుఖపడేది? అసలు మురారిమీద సీతాపతికీ, కాంతమ్మకీగల ప్రత్యేకాభిప్రాయం యేమిటో ఎవ్వరికీ తెలియదు. ఇలాంటి దుస్థితిలో సావిత్రి, మురారికి చరణదాసి యెలా కాగలుగుతుంది? తనకి తెలుసు యీ సంగతంతా. అందుకనే పార్వతి తనలో తాను సావిత్రిని గురించి అహర్నిశలూ, ఎడతెరపే లేకుండా ఆలోచించసాగింది. సావిత్రి మాత్రం కలత నిద్రలో యేవేవో మాటలు వుచ్చరించుతోంది...ఆ నాటినుంచి...

3

ఒకవారం రోజులు గడిచిన పిదప సీతాపతి ఒకనాటి మధ్యాహ్నానికల్లా తిరిగొచ్చాడు. కాంతమ్మ యెదురుగావెళ్ళి సీతాపతి చేతిలోని సంచిని అందుకుంటూ ఆత్రంకొద్దీ పల్కరించింది. ఇంతలో పార్వతి కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళు అందిచింది సీతాపతికి. అతను కాళ్ళు కడుక్కుంటూ — "అమ్మాయి ఏదమ్మా?" - అని కాంతమ్మ వంక చూస్తూ ప్రశ్నించాడు. మంచినీళ్లు చేతికిస్తూ పార్వతి - "గదిలో వుంది" అన్నది మామూలుగా. కాంతమ్మ, పార్వతి వంక అదోలా చూస్తూ — "కొడుకు తన్నడిగినప్పుడు, నువ్వెందుకు జవాబిచ్చావ్?" అని మనస్సులో అనుకుంది.

సీతాపతి నెమ్మదిగా అనుష్ఠానాలన్నీ పూర్తిచేసుకొచ్చి, తాపీగా కుర్చీలో కూర్చొని — "చివరికి సంబంధం కుదుర్చుకొచ్చేటప్పటికి తాతలు దిగొచ్చినంత పనైంది" — అన్నాడు ఒక్కనిట్టూర్పు భారంగా విడుస్తూ. ఆ మాట వినేసరికి, కాంతమ్మ మనస్సు మిగతా విషయాలకోసం ఆరాటపడింది. నిజంగా యీ సంబంధం చాలా కష్టపడి కుదుర్చుకొని రాగల్గినాడనీ, తను చెప్పినట్లుగా బుద్ధిగుంతుడిలా చేసుకొచ్చాడనీ యెంతో సంతోషించింది.

పార్వతి భర్త వెనకాలే నిల్చుని చెప్పబోయే మాటల్ని శ్రద్ధతో విందామనుకొనసాగింది. గదిలో మాత్రం అంతవరకూ ఏకాంతంగావున్న సావిత్రి మెల్లగా లేచివచ్చి తల్లి ప్రక్కనే నిలబడింది.

సీతాపతి కుదుర్చుకొచ్చిన సంబంధ వివరాల్ని నొక్కిచెపుతూ — "అమాంబాపతూ లాంఛనాలతో సహా మొత్తం మూడువేల ఐదు వందలకు వొప్పుకున్నాను. కుర్రవాడు B.A. ప్యాసయి ప్రస్తుతం తాత్కాలికోద్యోగం చేస్తున్నాడు గుంటూరులో. పెద్దగా ఆస్తిపాస్తులు లేకపోయినా, వుంటానికి ఒక పెంకుటిల్లు వుంది. తండ్రిలేడు, కుర్రవాడు చామనఛాయగా వుంటాడు. అమ్మాయికి యీడుగా వుంటాడనుకొంటున్నాను" — అని చెబుతూ సావిత్రి వంక చూశాడు.

సావిత్రి పరాన్ముఖురాలైంది.

ఇంతలో కాంతమ్మ - "పేరేమిటీ?" - అన్నది. పార్వతి, తన మనస్సులో - "ఇక పేరేదైతే నేం?" నిర్వేదంతో. సీతాపతి — "రమణమూర్తి" అన్నాడు జవాబుగా.

కాంతమ్మకు కాబోయే పెళ్ళికొడుకు పేరు చెవులారా వినేసరికి ఆ యేడుకొండల వెంకటరమణుడు, తన మనుమరాలికి ప్రత్యక్షమై భర్తగా కాబోతున్నాడని - పరమానందపడింది.

"మరి ముహూర్తాలెప్పుడు పెట్టుకుందాం?" - అని కాంతమ్మ వుండబట్టలేక ప్రశ్నించింది.

"వచ్చే మాఘమాసంలోనే ..యింకా ఆలస్యం దేనికి?" - అన్నాడు సీతాపతి. అంతవరకూ పార్వతిగానీ, సావిత్రిగానీ యేం మాట్లాడలేదు.

మాఘమాసం వచ్చేలోపుగా, రమణమూర్తి, అతని తాలూకువారు ఒకసారి కాబోలు వచ్చి సావిత్రిని చూసి సంబంధాన్ని మనస్ఫూర్తిగా స్థిరపర్చుకున్నారు. యిరుపక్షాలవారూ కట్నాలకు ఒప్పుకున్నారు. రమణమూర్తి మాత్రం తనవారెవరడిగినా, సావిత్రిని గురించి పెద్దగా యేమీ పొగుడుతూ చెప్పలేకపోయాడు. కనీసం తన తల్లికి కూడా తన హృద్భావాన్ని వెలిబుచ్చలేదు. తనలో తనే తృప్తిపడి వూరుకున్నాడు. యిలా కార్యకలాపాలన్నీ పూర్తి చేసుకునేసరికి వుత్తరాయణ పుణ్యకాలం వచ్చింది. యిరుపక్షాలవారు తాంబూలాలు యిచ్చి పుచ్చుకున్నారు. జాతకాల ప్రభావంవల్ల లగ్నం మంచిదే కుదిరిందని వారూ - వీరూ కూడా పెళ్లి పనులు చేయటానికి పూనుకొన్నారు సంతోషంతో.

సావిత్రిలో అంతవరకూ వున్న అభిప్రాయానికి ఆయువుపోయింది. తను చదువుకొన్నందుకూ - సంస్కారం కల్గివున్నాననుకున్నందుకూ, అనగా యింతకాలమూ బ్రతికివున్నందుకూ ప్రయోజనం లేకపోయేసరికి, విరక్తిగా విచారపడటం మొదలెట్టింది.

సావిత్రి యిప్పుడు కుంపటిలో కుసుమంలాగా వుంది. తెనిపోని ఆలోచనలతో కుమిలిపోసాగింది. కన్నతల్లిదండ్రులుండి కూడా తనకే వుపయోగము చేయలేకపోయేసరికి యిక యిలా బ్రతకటం అనవసరమనుకొంది.

ఆనాడు సీతాపతి యింటివద్ద లేడు. కాంతమ్మ చేసినపనినే, పదిసార్లు 'శుభ్రం' అంటూ చేయటం ప్రారంభించింది. పార్వతిని ఒక్క నిముషం కూడా తీరిగ్గా వుండనీయటంలేదు. యేదో పనిని పురమాయిస్తూ, పార్వతి యెముకల్ని కొరుక్కుతినటం మొదలెట్టింది. పార్వతి అన్నిరకాల హింసలకూ లొంగిపోయి, కూతురి ముఖం చూస్తూ, కన్నీటిని ఆపుకొంటూ అన్నిపనులూ చేయసాగింది.

సావిత్రి మాత్రం ఒంటరిగా తన గదిలో కూర్చొని సుఖపడవలసిన జీవితం యిలా అయిపోయిందేమిటా! అని విచారించటం మొదలెట్టింది. ఆలోచిస్తున్నకొద్దీ తనమీద. తనకే విరక్తి - వెగటు పుట్టింది. ఎవర్నేమన్నా లాభం లేదనుకొంది. అప్పటి మురారిని చూసి చాలాకాలమైంది. ప్రభుత్వోద్యోగిగా బళ్ళారి వెళ్ళిన క్రొత్తలో మురారి, పార్వతి పట్ల వుండే ప్రేమాభిమానాలకొద్దీ, సీతాపతి పేరిట అడపా - తడపా వుత్తరాలు వ్రాస్తూండేవాడు. అందులో మేనత్తయిన పార్వతికి వందనాలు, మరదలైన సావిత్రికి ఆశీర్వచనాలు తెలుపుతూండేవాడు. 'నీ ఆశీర్వచన ప్రభావంవల్ల నేను కులాసాగా చదువుకొంటూనే వున్నాను బావా!' అని యెప్పటికప్పుడు ఒక వుత్తరం సరదాగా వ్రాయాలనుకొనేది సావిత్రి. (సశేషము)




సాహిత్యసరస్వతి శ్రీ సీరిపి ఆంజనేయులు

(అన్ని హక్కులు రచయితవి)

(గత సంచిక తరువాయి)

౪

విద్యాపురంబున విప్రవాటికను
వసియించి, నుతిఁగన్న వర్తనుండంచుఁ
దిగకంటి నలరించు తెలిమేలటంచు
నెన రొలికించు వెన్నెలవెల్లి యంచు
వితరణగుణియంచు విబుధుండటంచు
సాత్త్వికగుణ శుద్ధశాంతాత్ముఁడనుచు
వెలసి, సర్వార్థసంవేదియై యొలసి,
సంక్రందనునకు వాచస్పతి భాతి
శ్రీ బుక్కదొరకు మంత్రిశ్రేష్ఠుఁ డగుచు
నొప్పు నారాయణాఖ్యుని గూర్చి తెలిసి,
యల్లన మేళమ్మ యాతనిండటిసి,
పెన్నిధిఁ గనుఁగొన్న పేదచందమున
ఫలభారనమ్రమా పాదప మటుల
అతుల గౌరవమున కాస్పదుండగుచుఁ
గ్రాలెడు సచివశేఖరు విలోకించి,
స్వాంత మువ్విళులూర నఱమఱదొఱఁగి
కడముట్టఁ దన దైన్యకథ నివేదించె.

అదివిని ప్రెగ్గడ మది నెయ్యమూని,
యా తల్లి కొడుకుల కాదరార్ద్రి మునఁ
దనయింట నునికికై స్థానం బొసంగి,
యన్నవస్త్రంబుల నలరిచి, బుడుత
కుచితముహూర్తాన నుపనయనంబు
జరిగించి, యుత్తమాచార్యయొద్ద
నాగమవిధులు—శాస్త్రార్థసంగతులు –
వెండియు లౌకికవిద్యలుంగూడ
నలవడఁజేసి, చిక్కనజాడలరసి,
యతని దౌబుద్ధిసూక్ష్మత గమనించి,
సాత్త్వికసద్గుణ సంపద నెఱిఁగి,
తొలి జన్మకృతతపఃఫలధన్యుఁ డగుట
నిచ్చమెచ్చుచుఁ, జన వెంతయుఁ జూపి,
ధరణీశు శాలకుఁ దనతోడ వడుగుఁ
గొనిపోవుచుండె; మక్కువఁ బెంచుచుండె.

అంతట నొకనాఁటి యర్ధరాత్రమున
నరుదార ఢిల్లీశు నాస్థానదూత
యుప్పరముననుండి యురలినభంగి
విద్యాపురీశు నివేశానఁ బొలిచి,
పాదుషా పనిచిన ఫరరమాన నొండు
శ్రీ బుక్కరాణ్మణిచే నిడ, నృపతి
తనకు నవీనమై తనరుటం జేసి
పత్రిమందలి లిపి పఠియింపలేక
యాశ్చర్యరసపరీతాత్ముఁడై భటులఁ
'బండితు నొరుఁదెండు పొం' డంచు ననుప
నర్ధమ నిసి యగు నవ్వేళయందుఁ
దలపీటఁ దూలికాతల్పంబు పైన
నిదిరించుచున్న మానిసిఁ జిక్కనాఖ్యు
మేల్కొల్పి కొనిపోయి, మేదినీనాథు
సమ్ముఖంబున నిల్ప, జగతీవరుండు
కమ్మ నమ్మూర్తి కరమ్మున నునిచి,
పఠియింపఁ గోర, నా ప్రతిభోన్నతుండు
లిపి క్రొత్తదయియున్న లేఖ నెమ్మదిగ
నతిసూక్ష్మబుద్ధి నాసాంతము చూచి,

యందలి భావమ్ము నవలీలఁ దెలిసి,
యుర్వీశు తల్లజు నుల్ల ముప్పొంగ
నరఁటిపం డొలిచి తా నఱచేత నిడిన
చాడ్పున వివరించి చనె గేహమునకు.

అమ్మఱుదినమున నా దూతవచ్చి
ప్రతిలేఖ నర్థింపఁ, బ్రభువరేణ్యుండు
దానిని లిఖియింపఁ దమకంబువడుచు,
వ్రాయసకాండ్రను రావించి యటకుఁ,
దా విన్న యంశమంతయు సంగ్రహముగ
వినిచి, లేఖకుల 'కా విధమున బదులు
రచియింపఁ దగు' నంచు వచియించు నంత
మంత్రులు లేఖకుల్ మదిఁ దృప్తిఁగనక
పాదుషా యనిచిన ఫరమానలోని
పదవాక్యములు తీరు-భావమ్ము తెఱఁగు
పరికించి వ్రాయుటే పరిపాటియంచు
వినతి యొనర్ప, భూవిభుఁడు పత్రంబు
వెదకించెఁ గాని యయ్యది కొల్వునందుఁ
గనఁబడ కునికి, వక్కాణ మెల్లఁ దొలుత
వినిచిన యువకుని వేగ రప్పించి,
విషయమ్ము వివరింపఁ బ్రెగడలర్థింప
నా ప్రతిభాశాలి - యాజవ్వనుండు
అతులితధారణాన్వితుఁ డౌట - నపుడ
లేఖకుఁ బ్రతికృతుల్ లిఖియించి యరిగె

పదపడి వసుమతీపతి కొల్వుడించి,
యంతిపురికిఁ బోవ, నచటి దూలంపు
నెఱియ నొదింగి కాన్పింప నా జాబు
విస్మయాన్వితుఁ డయ్యె విభులేశ్వరుండు.

అద్దాని భూభర్త యాస్థానమందుఁ
జిక్కన్న వ్రాసియిచ్చిన ప్రతితోడ
లేఖకులకుఁ జూపి, లేఖకు నకలు
మక్కికిమక్కి సంభవమయియుంట
ధారుణీశ్వరుఁడు చిత్రమున గుర్తించి,
చిక్కన్న యెఱుకకు మిక్కిలి యలరి
'యేకసంధాగ్రాహి' యితఁడంచుఁ దలఁచె,
అంతట నొక్కనాఁ డప్పార్థివుండు -
సామంతులును గవీశ్వరు లమాత్యులును
సేనాధిపతులుఁ బ్రసిద్ధపండితులుఁ
బౌరముఖ్యులును సభాస్తారు లతిశ
యోజ్జ్వలత్వము నొంది యొడ్డోలగమున
నాసీనులయి యుండు నవసరమందు,
నుడురాశి నడుమఁ బొల్చెడు నోషధీశు
వడువున రమణమై వఱలుచునుండి,
వరణీయ రూపలావణ్యశోభితుని
నాగమవిహిత ధర్మానువర్తనుని
విద్వదాదరణీయ విజ్ఞానఖనిని
వినయభూషణుఁ దేజ నొనగూర్చుమణిని
నొరుసేవఁ దలకొను నుపకారగుణిని
అమృతవాఙ్నిధిని నింబగు చిక్కసుధిని
నచటికి రావించి, యాసీనుఁ జేసి,
సగసులా ప్రాజ్ఞల సాధువాదములు
వంది మాగధుల కైవారగీతములు
రమణీయ మంగళారవములు చెలఁగ -
మమత తోరముగాఁగ - మంత్రిపదమ్ము
'నొడయరు' బిరుదమ్ము నొసఁగి యర్పించి
స్తుతియించె - నతని భూసురవరుల్పొగడ.

(సశేషము)

5

# త్రాగుబోతు

జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ



ఇంతవరకు సాగినకథ

[ భార్యతో అనవసరంగా పేచీలు పెట్టుకునీ, పైకి వస్తూవున్న వ్యాపార సంస్థని చిందరవందర చేసి తన సహజ సుఖజీవనానికి దూరమై కంట్రాక్టర్ సొమ్మర్ పానీయాలకి దాసానుదాసుడయ్యాడు. భార్య కోరికమీద సొమ్మర్‌ని పరీక్షించి అతన్ని త్రాగుబోతు క్రింద కట్టివేస్తూ సర్టిఫికేట్ ఇయ్యటానికి డాక్టర్లు అతనిమీద దాడిచేశారు. వాళ్ళవాతనుంచి ఎలాగో తప్పించుకుని తలదాచుకొనటానికి దోవలో నడవగా నడవగా కనబడ్డ కార్మికుల పేటలో ఆ రాత్రికి ఒక ఇంటిదగ్గర ఆగి ఆ ఇంట్లో గది నొకదానిని అద్దెకు పుచ్చుకున్నాడు. చిల్లి కాసులేదు. కడుపు నింపు కోటానికి తనకి కావలసిన భోజనపదార్థాలను, పానీయాలను, తన వుంగరాన్ని కుదువబెట్టి ఇంటిమనిషి లోబెడాన్స మూలాన తెప్పించుకున్నాడు — ఇక చదవండి. ]

ఈ రాత్రిపూటే మా ఇంటికి వెళ్ళి ఇలాటి చోట్లల్లో చీకూచింతా లేకుండా కొంతకాలం వుండిపోవటానికి అవసరమైన దుస్తులను, టాయిలెటు సామాన్లను తెచ్చుకోవాలని నిశ్చయించుకున్నాను. డబ్బుకూడా కొంత చేతిలో వుండటం ముఖ్యం. ఇంట్లో నా బల్లసొరుగుల్లో డబ్బు దాచుకుంటూ వుండటం నాకు అలవాటు. వాటిలో వున్న సొమ్మని ఖాళీచేసుకుని తీసుకుని రావాలని కూడా ప్లాను వేసుకున్నాను. ఆ పనిని చేయగలిగానా ఈ లోబెడాన్స ఇంట్లోనే ఎలాటి యిబ్బందులు లేకుండా నాలుగైదు వారాలు అజ్ఞాతవాసంలో హాయిగా వుండిపోవచ్చు. పానీయాలను, ముఖ్యంగా ఘాటు సారాయిని పుచ్చుకుంటూ వుండటంమూలాన ఎలాటి ప్రమాదాలకి లోనుగావలసి వుంటుందో నాకు బాగా తెలును. ఈ పాడుపానీయాలకి దాసానుదాసుడ్నయి పోవటం మూలానేగా, అటు మా ఇంటికి, ఇటు మా వ్యాపారసంస్థకూ దూరం కావలసివచ్చింది! ఎవళ్ళకి తెలియకుండా ఇలా ఈ ఇంటిలోనే కొంతకాలం వుండిపోయానా, ఈ త్రాగుడు అలవాటునుంచి బయటపడవచ్చుననే నా వుబలాటం. అమాంతంగా ఈ అలవాటు మానుకోటం మనతరంకాదు. అంచేత తీసుకునేదాన్ని దినం దినం కొంచెం కొంచెం తగ్గించుకోటానికి పట్టుపట్టితే నా వారం రెండు వారాలలో ఈ వ్యసనాన్నే పూర్తిగా మానుకోవచ్చనే ధైర్యం నాకు వుంది. అలా పట్టు పట్టానా ఇక జయం నాదే. ఇక అలాంటప్పుడు ఎలాటి నాటకం ఆడకుండానే నా భార్య మాగ్దాను కలుసుకోవచ్చు. నన్నంత కంగారుపెట్టిన ఆ ఇద్దరు డాక్టర్లని యథేచ్ఛగా చూడవచ్చు. వాళ్ళముఖం ముందరే అదురూ బెదురూ లేకుండానే "నా విషయం ఏం తెలుసుకోవాలని అలా ఆరాటపడుతున్నారో ఇక చెప్పండి?" అని స్పష్టంగా అడిగి వేయవచ్చు...

సామాను గట్రాను తీసుకుని రావటానికి మా ఇంటికి వెళ్ళినప్పుడు మా మాగ్దా నేను అక్కడికి రావటం పసిగట్టవచ్చు. లోపలి సామాను బయటికి రానీయకుండా అటకాయించవచ్చు. అలా మాగ్దా కలుగచేసుకోవాలనే నా కోరికకూడా. అంత

ప్రశాంతమైన అర్ధరాత్రిపూట వున్న సంగతులు ముఖాముఖిగా ఆవిడకి చెప్పివేయటమే మంచిదికదూ! పదహైదు సంవత్సరాలనుంచి సుఖంగా సంసార రథాన్ని నడుపుతూవున్న తన భర్తని ఆఫీసు పని వాళ్ళ ముందు అవమానంచేయటమే కాకుండా ఈ డాక్టరచేత కూడా అవమానం చేయించటానికి ఎలా దమ్ములు వచ్చాయో అడగవచ్చు. అంతటితో వూర కుంటూనా? తరువాత ఏ నాటకమాడినా దానిని సాగనీయకుండా వుండటానికి ఎలాటి ఎత్తులు వేయాలో నాకు బాగా తెలుసునని స్పష్టంగా ఆవిడ ముఖంముందే చెప్పివేస్తాను. దాంతో ఆవిడ వుక్కిరి బిక్కిరైపోయి కాళ్ళబేరానికి తప్పక వస్తుంది...

మనం అనుకునేది ఒకటి. జరిగేది ఒకటి. నా ప్లానుని చిందరవందర చేయటానికి ఆ పాపిష్టి పానీయం తిరిగి దాపరించింది. దానిని త్రాగటం మూలాన మైమరచి పడిపోయేవుంటేనా, ఒకగంటో, రెండు గంటలో దానికి తల ఒగ్గిపోయి, తరువాత నేను అనుకున్న పనిని యథాతథంగా చేసుకుని వుండి వుండేవాణ్ణి! అంత అదృష్టమా! ఇంటిమనిషి తెచ్చిన సారాయం బుడ్లల్లో ఏం కలిపారో మరి? నిద్రాదేవత అమాంతంగా ఆవరించింది. దాంతో కొంత సేపు నిద్రపోయివుంటే బాగుండేది. అలా హాయిగా నిద్ర పోనిస్తేగా! ఏవో పిచ్చికలలు! వాటితో హడలిపోతూ ఒక్కనిమిషం లేచి కూర్చోటం మంచి దనుకుని లేవబోయాను. దేహం నన్ను లేవనిస్తేకదూ! కొయ్యబారిపోయింది. కడుపులో కనివిని ఎరగని సంక్షోభం! ప్రక్కనే బల్లమీద తినగా మిగిలిన భోజనపదార్థాలు వున్నాయి. తరువాత పుచ్చుకో వచ్చుని జాగ్రత్తపరచుకున్న బుడ్లుకూడా వున్నాయి. వాటిని తిని బుడ్లనే అమాంతంగా ఖాళీచేస్తే, ఈ సంక్షోభంనుంచి విముక్తి కలుగుతుందని అనుకుంటూ ఎలాగో వాటితో కడుపు నింపుకున్నాను. దాంతో కునుకుపట్టింది. అదీ క్షణికమే! వాంతులు! కట్టలనే అమాంతంగా తెంచుకుని వస్తూవున్నాయి. పడుకున్న మంచం, కప్పుకున్న దుప్పట్లు ఖరాబు అయ్యాయి... ఒళ్ళంతా మంటలు – భరింపరాని మంటలు. చెమటలు కమ్మిపోతున్నాయి. కాళ్లూ చేతులు గడగడ వణికి పోతున్నాయి. గుండెలు దడదడ కొట్టుకొంటూ వున్నాయి. కళ్ళు మసకలు కమ్మిపోతూ వున్నాయి. తె అ నో ష్టి గా......ఇలా ఇవన్నీ ఎం దు కు నన్ను ముట్టడించాలి? పడుకోనియ్యవు. కూర్చో నివ్వవు. మృత్యుదేవత నన్ను కబళించుకొని పోటానికి ఏమూలనో పొంచి ఈ నాటకాన్ని చూస్తూ ఆనం దిస్తూ వుండాలి! ఆ దేవతకి చెరలాటం నాకు ప్రాణ కంటకంకాక మరేమవుతుంది?

ఇంత తొందరగా మృత్యుదేవతకి కబళం అయి పోవాలసిన అంత్యదశలోకి నిజంగా వచ్చానా? నా యిప్పటి పరిస్థితులు స్పష్టంగా తెలిపేది ఆ దోవలోనే నడవటం తప్ప మరేగత్యంతరం లేదనేగా!

త్రాగుబోతులకి మరణం అంత సులభంగారాదని పుస్తకాల్లో చదివాను. అందులో ఆరితేరినవాళ్ళు చెప్పగా ఈ చెవులతోనే విన్నాను కూడా! ఇలాటి అవస్థలో చావటం నాకు ఇష్టంలేదు. నిద్రాణంలో నున్న శక్తులని లేవదీసి, ఆ మృత్యుదేవత దోవకి అడ్డువేసుకున్నా నా పదికాలాలపాటు హాయిగా బ్రతకవచ్చు. నామీద కత్తికట్టినవాళ్ళని చీల్చి చెండాడవచ్చు!...

ఇంతకూ ఇప్పుడు ఏంచేస్తే ఈ యమయాతన నుంచి గట్టెక్కగలుగుతాను? బుడ్లు ఖాళీ అయి పోయాయి. గిన్నెలు నిండుకున్నాయి. ఇక అంతా విధికే ఒప్పగించేయటం మంచిది. ఎంత గుండెనిబ్బరం చేసుకున్నా వాంతులు ఆగాయి కావు. నా ఒంటిని, పడకని ఖరాబు చేయటమేకాక గదినంతా అల్ల కల్లోలం చేసివేశాయని చెప్పితే చాలు...

కళ్ళు తెరిచి గది నలుప్రక్కలా కలయచూశాను. గదినిండా వెలుతురు. అంతూపంతూలేని వెలుగు! అప్పుడు చీకటిలో సంక్షోభాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆ సంక్షోభం అలాగేవుంది. కటికచీకటి ఇంత వెలుగుగా మారింది. అంతే తేడా! ఇదంతా కలా! లేక మరేమవుతుందో అని హడలిపోతూ వున్నాను....

ఆ క్షణాన్నే ఇంటాయన తలుపుతెరచి కాఫీ పుచ్చుకుంటారా అని నాకేసి విస్తుపోతూ చూస్తూ అడిగాడు. కాఫీవద్దు, తక్షణం వెళ్ళి ఘాటుబుడ్డి తీసుకుని రమ్మని పడుకున్నవాణ్ణి అలాగే వుండి పోతూ అన్నాను.

అతనికి నామాట వినబడిందో లేదో? ఆదరా బాదరాగా చెంబుని, బక్కెట్ని తెస్తూ గదిని శుభ్రం చేశాడు. మంచిగాలి లోనికి రానివ్వటానికి కిటికీలని బార్లగా తెరిచాడు. సూర్యకిరణాలు నామీదికే దూసుకొని వస్తూ నా కళ్ళని కమ్మివేశాయి.

లేచి కూర్చోవాలని సతమతమైపోతూవున్నాను. ఇలాంటి సమయంలో ఆ మనిషి నా కోరిక చెల్లించకుండా ఆ గొడవలో పడిపోవటం నాకు నచ్చింది కాదు.

"ఇదిగో లోబెడాన్స్! నీకు వినబడిందా లేదా! నువ్వు రాత్రి తెచ్చిన బుడ్లు ఖాళీఆయిపోయాయి. కొత్తబుడ్డిని ఇప్పుడే తీసుకొనిరావాలి!" అతనిమీద మండిపడిపోతూ అన్నాను.

"అంత కోపపడటం అనవసరం! తొమ్మిది గంటలకి బ్యాంకుకి వెళ్లాలసిన పనివుంది." నా విధ్యుక్త ధర్మాన్ని నాకు జ్ఞప్తికి తెస్తూవున్న ధోరణిలో నాకేసి వింతగా చూస్తూ అన్నాడు.

"నా స్థితి నువ్వు చూస్తూనే వున్నావుగా! ఇలాంటప్పుడు ఎలా వెళ్ళగలుగుతాను! రేపు వెళ్తాను. కాకపోతే ఇవ్వాళ సాయంకాలమే ఆ పని చేస్తాను. ఈలోపుగ మంచి సారాయిని తీసుకొనివచ్చి ఇయ్యాలి" ధుమధుమలాడుతూ అన్నాను.

"మీరు అలా అంటే నేనేం చేయగలుగుతాను? అలాంటి పరిస్థితుల్లో వుంగరాన్ని అమ్మాలని వస్తుంది. తాకట్టుగా వుంచుకుంటే అయిదు మార్కులు (అయిదున్నర రూపాయలు) ఇస్తానన్నాడు తాకట్టు అంగడిమనిషి. అతనికే అమ్మకానికి చూపెట్టితే ఇరవై అయిదు మార్కులు ఇయ్యవచ్చు."

"ఏమంటావు? ఇరవై అయిదు మార్కులేనా! ఆ వుంగరాన్ని చేయించటానికి నూరు మార్కులకి పైగా ఖర్చుచేయాలసివచ్చింది" మండిపడి అరుస్తూ అన్నాను.

"అప్పుడు అంత ఖర్చుపెట్టి వుండవచ్చు! ఇప్పుడది పాతవుంగరం. మనకిమల్లె అంగడాయన బతకాలి కదూ! ఇరవై అయిదు మార్కులకి వాళ్ళకి అమ్మటానికి ఒప్పుకుంటే మీరు అడిగిన బుడ్లను ఈ నిమిషాన్నే తీసుకునివచ్చి ఇస్తాను" తన ధోరణిలో ఆ మనిషి నా చెవిలో వూదాడు. రాత్రి తను తీసుకొని వచ్చిన సామాన్లకి తను వ్రాసి తీసుకొనివచ్చిన బిల్లును నాముందర వుంచాడు.

ఆ మొత్తాన్ని చూస్తూ హడలిపోతూ "రాత్రి సామాన్లకి పదహైదు మార్కులా! భోజనానికి బుడ్లకి నా లెక్కప్రకారం అంత మొత్తాన్ని పెద్ద హోటళ్ళల్లో కూడా తీసుకోరు" అన్నాను.

"ఏమండోయి గది అద్దెసంగతి మరచిపోయినట్లు వున్నారే? నేను బీదవాణ్ణి. అద్దె పుచ్చుకోకుండా వుంటేనా...నిజంపట్టి చూస్తే గదికి మాత్రమే పన్నెండు మార్కులు బిల్లు చేయటం న్యాయం... ఇప్పుడు నేను చేసినపని చూస్తూనేవున్నారుగా — ఇంక ఆ సంగతి ఎందుకులెండి!..." గొణుక్కుంటూ తలగోక్కుంటూ నాకేసి వెకిలిగాచూస్తూ "మిమ్మల్ని చూసి జాలివేసి ఏడు మార్కులే గదికి ఛార్జి చేయాలని అనుకున్నాను. మీదంతా జమీందారు దర్జా! నేనుకున్న నూటుతోనే పడుకున్నారు. మీ బట్టలను చెడగొట్టుకోటమే కాకుండా మా పడకను, దుప్పట్లను చెడగొట్టివేశారు. వీటిని వుతకటానికి ఎంత ఖర్చు చేయాలసివుంటుందో మీకేం తెలుస్తుంది?... మేం బీదవాళ్ళం ఆ సంగతి మరచిపోవద్దు" అన్నాడు.

"నీ పనేమో నువ్వు చూసుకోక ఇలా పుక్కిటి పురాణం చెప్పటానికి ప్రారంభించావా ఏంచేస్తానో చూడు!" పొలికేకలు పెడుతూ అన్నాను.

"చిత్తం! చిత్తం!" పళ్లు బిగబెట్టి అంటూ లోబెడాన్స్ గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

ఎంత చిర్రెత్తిపోతున్నా ఇప్పటి పరిస్థితుల్లో లోబెడాన్స్‌దే పెద్దచెయ్యి కదూ! ఒకవైపు ఆకలి దహించుకొనిపోతూవుంది. ఇంకోవైపు దాహం! అంతూపంతూలేని దాహం! అతనితో ఇప్పుడు రాజీకి రాకపోతినా...తలుపు బార్లగానే తెరిచి వుంది. గొంతు చించుకుంటూ అతన్ని పిలిచాను. అతను కోర్కున్న మొత్తానికే వుంగరాన్ని అమ్మివేసి నాకు కావలసిన వస్తువులని తక్షణమే తీసుకుని రమ్మని ప్రాధేయపడ్డాను....

బయటికి వెళ్ళిన లోబెడాన్స్ తొందరగా వచ్చే మనిషైతేగా! లోపల ఇలా చావుబ్రతుకుల మధ్య వుక్కిరిబిక్కిరైపోతుంటే ఆ అంగళ్ళముందు, ఈ అంగళ్ళముందు ఆ మనిషి ఏం వెలగబెడుతూ వున్నాడో?...

అతను మిట్టమధ్యాహ్నం వేళకి వాటిని తెచ్చి ఇచ్చినా అందులో పుణ్యం పురుషార్థం వుంటేగా! బుడ్డితీసి గ్లాసు నింపాను. అది పెదవికి తగిలేటప్పటికి తిరిగి వాంతులు, వికారం, తలనొప్పి....

ఆరోజు అలా గడిచిపోయింది. రెండోరోజు, మూడోరోజు అంతే! పడకలో కృంగి కృశించిపోయినవాణ్ణి అలాగే వారాల పర్యంతం లోబెడాన్స్ ఇంటిలోనుంచి బయటికి అడుగుబెట్టలేకపోయానని అంటే చాలుననుకుంటాను.

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వెంకట కృష్ణశర్మ

(గతసంచిక తరువాయి)

గురునానకున కొకసోదరి గలదు. ఆమె పేరు నానకి. అప్పటి ఢిల్లీ చక్రవర్తియగు "సుల్తాన్ బహార్ లోట్" అనునతని బంధువగు 'నవాబ్ దౌలత్ఖాన్ లోడీ' కడ దివానుగ నుండిన 'జయరాం' అనునతఁడు నానకిని బెండ్లాడెను. నవాబునకు కపుర్థాలా సమీపమున సుల్తానుపూరు నొద్దవిస్తారమైన జాగీరు ఉండెను. తనయక్కకు వివాహమయినపిదప, నానకుగూడ గృహస్థాశ్రమము స్వీకరించెను. అతనిగృహిణి 'గుర్దాసుపుర' మండలములోని 'బటాలా' గ్రామవాస్తవ్యుఁడైన 'మూలా' అను నతనికుమార్తె యగు 'సులఖాని.' సంసారభారము నెత్తిపైఁబడినచోఁ గుమారుఁడు తిన్నగఁ ద్రోవకువచ్చునని యాశించినతండ్రి కాశాభంగమయ్యెను. నానకునకు జితపడిన ఆధ్యాత్మిక చిత్తవృత్తి యందించుకేని మార్పు కలుగలేదు. ఎప్పటివలెనే యతడటప్రాంతములకును, ఏకాంత ప్రదేశములకును ధ్యానసమాధినిష్ఠకై వెడలుట మానకుండెను.

నానకియు, ఆమెభర్తయగు జయరాముడును నానకునం దత్యంతానురాగము జూపెడువారు. 'తాల్వండీ'- జమీందారుఁడగు 'రాయిబులారు'ను అతని నెక్కువగ గౌరవించెడువాఁడు. బావయగు జయరాముఁడు నానకు నేదో యొకయుద్యోగమున నియమించిన బాగుండుననియు, నతని సుల్తానుపురమున స్థిరనివాసిగఁ జేయవలయుననియు భావించి, యొకనాఁడతనిఁ దన నవాబుకడకుఁ గొంపోయెను. నవాబాతనిఁ దనయుగ్రాణమున కధికారిగ నియమించెను. అతఁడు తనయుద్యోగమును సక్రమముగను, సంతృప్తికరముగను నెఱవేర్చి, యెల్లరను సంతసింపఁ జేయుటచే వారినుతులకుఁ బాత్రుఁడయ్యెను. ఆకాలమున ప్రభువులు ఉద్యోగులకు నాణెముల (ద్రవ్య) రూపమునఁగాక వస్తురూపమున వేతనములొసంగెడువారు. నానకుఁ దనకట్లు వచ్చునట్టి వస్తుసముదాయమునఁ దనమునుగడకుఁ గొంచెముగఁ దీసికొని, మిగిలినదానిని బీదలకుఁ బంచెడువాఁడు.

నానకునకు క్రీ. శ. 1894 న 'శ్రీచంద్' అను కుమారుఁడును, 1897 న 'లక్ష్మీచంద్' అను పుత్రుఁడును ఉదయించిరి. అందు శ్రీచందు ప్రాపంచిక విషయములనెల్లఁ బరిత్యజించి, "ఉదాసీ" సంఘమను సన్న్యాసులకూటమి నెలకొల్పెను. అయిన వారీనాఁటి తక్కినసన్న్యాసులవలె ముండులు గారు. ఉదాసీలు తలవెండ్రుకలను బొడవులగు గడ్డములను గలిగియుందురు. క్షురికాయుధము (మంగలికత్తి) దేహమునందలి యేభాగమునకుఁ గాని తగులుటను వారు కచ్చితముగ నిషేధింతురు. నానకు రెండవ కుమారుఁడగు లక్ష్మీచందు సహజముగ అందఱివలెనే పత్నిని స్వీకరించి, యిరుగురుకొడుకులఁ గాంచెను.

నానకు తనయుద్యోగమును బరిత్యజించి, తనకున్న సర్వస్వమును బీదలకుఁ బంచిపెట్టెను. అతఁడడవులలో నివసింప నారంభించి ఫకీరువేసముం దాల్చెను. అతఁడు కఠిననియమములతో నెల్లప్పుడు దైవధ్యానసమాధినిష్ఠుఁడై కాలము గడుపఁజొచ్చెను. అతఁడు భగవంతునిగూర్చి వీనులవిందుగఁ బాడెడువాఁడు. అవన్నియు నెప్పటికప్పుడు ఆలకించువారు వ్రాసికొనెడివారు. ప్రకృతమవి సిక్కుల పవిత్రగ్రంథమగు "ఆదిగ్రంథము"నఁ గలవు.

తాల్వండిమంత్రియగు మర్దనుఁడు నానకుకడకు వచ్చి అతని భక్తితో సేవింపదొడంగెను. తనగురువు పాడుచుండఁగా మర్దనుఁడా గానమును మూఁడు తంత్రుల వీణియపై వాయించెడువాడు. అతఁడు సంగీతమున గొప్పవిద్వాంసుఁడు. అతఁడు నానకు గీతమును వాయించుచు ఎల్లప్పు డతనితోఁగూడ సంచరించుచుండెను. నానకు తనముప్పదినాల్గవయేట ప్రజాప్రబోధకుఁడయ్యెను. అతని యుపదేశము లాలించెడివారి మనస్సులం దవి గాఢముగ నాటుకొనెడివి. అతఁడు సుల్తానుపురమును వదలి ఉత్తరహిందూస్థానమునకు యాత్రవెడలి అందందుఁ దిరుగసాగెను

ఇట్లుండ తాల్వండి జమీందారుడగు 'రాయిబులార్' తనవార్ధకదశలో నానకును జూడఁగోరి, అతని నెట్లేని తాల్వండికిఁ బిలిచికొనిరా, నొకవార్తాహరుని బంపెను. జమీందారు నానతిమెయి నానకు తాల్వండికి వానితోఁగూడ నరిగి రాయిబులారును, తనవృద్ధజననీజనకులను, దక్కుంగల బంధువర్గమును

సందర్శించెను. చుట్టము లాతనిచుట్టుముట్టి, అతనికిం దమకుం గల సంబంధబాంధవ్యములను విశదీకరించిరి. వారందఱతని నింటికడనే సుఖముగ జీవింపుమనియుం జేబట్టినయుద్యమమును మానుమనియు ననేకవిధముల వేడికొనిరి. అందులకు నానకు వారింజూచి:- బంధువరేణ్యులారా! అపరాధక్షమయే నా తల్లి; సంతృప్తియే నాతండ్రి; సత్యమే నా మేనమామ; ప్రేమయే సోదరుండు; దయయే నాపితృవ్యుండు; ఓర్పే నా కూతురు. నాబంధుజాలమిట్టిది. శాంతియే నన్నెడవీడని భార్య, జ్ఞానమే నాపరిచారిక. ఇట్లు నా కుటుంబసహోదరులుండ నేనెక్కడ నున్న నేమి? ఎట్లుండిననేమి? ఎట్లుచరించిననేమి? నాభర్త- నా ప్రాణప్రియుండు సర్వసృష్టికర్తయగు ఆయేకైక పరిపూర్ణశక్తిసమున్వేతుడగు పరమేశ్వరుండే. ఎవ్వండా దేవదేవునినుండి వేఱగునో, వాడు జననమరణపు సుడిగుండమున దగ్గమై పరిభ్రమించుచు, దుర్భరశ్రమల ననుభవించును.

గురునానకు చక్రవర్తియగు బాబరుకడ నెక్కువ పలుకుబడి గలిగియుండెను. బాబరుసైతము నానకు విషయమున నత్యంతగౌరవముతో భక్తితో మెలగుచుండెను. బాబరు అతని కమూల్యములగు బహుమానము లీందలచెను. కాని నానకు వాని నిరాకరించెను. ఒకపరి నానకు బాబరును అమీనాబాదున బంధింపబడిన ఖైదీలను వదలిపెట్టి, వారి ఆస్తిపాస్తులను వారికి ఇచ్చివేయుమని కోర నతండట్లే యొనర్చెను. బాబరొకసారి సన్మతోపదేశములకై నానకు నర్థింప నతండిట్లు బోధించెను:-

"భగవత్సేవ చేయుము. ఆయన నామమును జపింపుము. పానము, ద్యూతము మానుము. ధర్మప్రవర్తనము గలిగియుండుము. యోగీంద్రులను భక్తవర్యులను గౌరవింపుము. ఎల్లరయందును కనికరము చూపుము. ఓడినవారిపై దయతో మెలగుము."

నానకు నిష్ఠాగరిష్ఠుడై కడుతీవ్రముగ భగవద్ధర్శనార్థము ధ్యానసమాధి నవలంబించెను. అతడట్టి సమయములలో తనయొడలినే మరచుచుండెను. తిండి పయి ఆస్థ వహింపకుండెను. నానకున కేదియో వ్యాధి సంభవించినదని తలంచి యతనికొఱకు కొక వైద్యుని పిలిపించిరి. నానకు ఆ చికిత్సకునితో ఇట్లు వచించెను:- "భిషగ్వరా, నీవు నావ్యాధిని కనిపెట్టి తగినయౌషధమీయ నేతెంచితివికదా! నాచేతి నాడీ గమనమును పరీక్షింపుము. వలదనను. కాని, నీవెంత అవ్యక్తుడవయ్యా! నావ్యాధి మానసికము. శరీర సంబంధి కాదు. కాన నీతో పనిలేదు. మరలి పొమ్ము. నేను భగవజ్జిజ్ఞాసాపరవశుడను. నీవుందు లేవియు నారోగముం గుదుర్పజాలవు. ఏకొలది మందియో నావ్యాధిని గుర్తింపగలరు. ఇట్టి జబ్బునకు నన్ను పాల్పరచిన ఆ దేవదేవుడొక్కడే దీని కుదుర్పజాలును. మరణవేదనవంటి బాధను నేను ప్రకృత మనుభవించుచున్నాను. ఏలయన పరమేశ్వర వియోగముచే నెంతయు క్రుంగి కూలారితిని. చికిత్సకుడా? నాకు నీవేయౌషధమిచ్చినను నిరుపయోగమే. ఈ భగవద్విరహరుజాతిశయముచే నశింపనిమ్ము! నేను దేవదేవుని విస్మరించితిని. ఇంద్రియసుఖముల స్వేచ్ఛగ అనుభవింపగోరితిని. కావుననే నాకీజబ్బు వలనిబాధ పీడింపదొడగినది. దుర్వృత్తికి మరలిన నాహృదయము దండనార్హము. ప్రభువయిన ఆ పరమాత్మనామమునం దొకభాగమేని ఎవడు ధ్యానించునో వానిమేను సువర్ణకాంతులతో ప్రకాశించును. దానిఆత్మ అత్యంతపావిత్ర్య మొందును. వాని బాధలు, వ్యాధులు పటాపంచలగును. పరమేశ్వరుని పరమపావన నామజపముచే నానకు మిగుల పరిశుద్ధుడు, సురక్షితుడు. వైద్యరత్నమా! నాక్రోధ వచనములకు గురికాకముందే నీవిటనుండి మరలుట శ్రేయస్కరము. నాగతికి నన్ను వదలిపెట్టుము."

నానకు దైవధ్యానసమాధియందే మునుపటికంటె ఎక్కువకాలము వినియోగింపసాగెను. కొన్నిదినముల కట్టియెడ నతడన్నపానములంసహితము గొనకుండెడివాడు. అతడు పూర్తిగ మౌనవ్రతమవలంబించెను. దినములకొలది పక్షములకొలది నతడెవ్వరికంట బడకుండునట్లు కీకారణ్యములలో భగవద్దర్శనార్థము పరిశ్రమించుచు తదేకధ్యానమున నుండెడివాడు.

(సశేషము)






# గోల్కొండ

శ్రీ డి. బి. నారాయణా కృష్ణారావు

బాలలూ! మీరు 'గోల్కొండ' దుర్గమును గురించి వినిఉంటారు. అది మొట్టమొదట 'మానుగల్లు' అనే పేరు గల్గియుండేది. ఈ మానుగల్లు 'గొల్కొండ' గా ఏవిధంగా మారిందో తెలుసా?

పూర్వము నేటి గొల్కొండ ప్రాంతమంతయు అడవిగా నుండెను. అందు ఒక సన్యాసి తపస్సు చేసుకొనుచుండెను. అతని పేరు 'గోకులదాసు'.

ఆ యడవికే 'కొండయ్య' యను పేరుగల గొల్లవాడు ప్రతిదినము మేకలు మేపుకొనుటకెళ్లుచుండెను. ఈ గొల్లకొండయ్యకు 'గోకులదాసు'పై భక్తి కుదిరెను. అందువలన నతడు గోకులదాసునకు ప్రతిదినము పాలు సమర్పించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు 'గోకులదాసు' ఒక పెద్ద బానలో నూనెపోసి సలసల కాగబెట్టెను. తర్వాత గొల్ల కొండయ్యను బిలిచి దానిచుట్టు ప్రదక్షిణము చేయుమనెను. అతడట్లు చేయుచుండ కొండయ్యను గోకులదాసు ఆ నూనెబానలో త్రోయుటకు ప్రయత్నించెను. గోకులదాసు యొక్క దుర్బుద్ధి తెలుసుకొన్న కొండయ్య కోపగించుకొని యాతనినే బట్టుకొని నూనెబానలో నెట్టివేసెను. వేసిన తక్షణమే 'గోకులదాసు' 'బంగారు విగ్రహ'మై పైకి వచ్చెను. ఆశ్చర్యము, వింతతో ఆ బంగారు విగ్రహమును కొండయ్య ఒక దగ్గఱి బావిలో వేసెను. ఆ విషయము సుల్తానుకు తెల్పి విగ్రహము బావిలోనుండి తీయించి దానిని కోట నిర్మాణమునకు ఒసంగెను. సుల్తాను దుర్గమును కట్టించి గొల్ల కొండయ్యకు జ్ఞాపకచిహ్నముగా దానికి 'గొల్లకొండ' అని పేరిడెను. క్రమక్రమముగా అది 'గోల్కొండ'గా మారినది.

ఈ కోట చాలపెద్దది. దీనిని వశము చేసుకొనుటకు ఔరంగజేబు 9 నెలలు ముట్టడిచేసెను. దీని గోడలన్నియు నల్లరాతితో కట్టబడినవి. ఇందు 87 బురుజులు గలవు. కోట శిఖరమున రాజభవనము కలదు. కొండపైకి పోవునపుడు గోకులదాసు బావి కన్పించును. ఆమీద 'అంబరుఖానా' వచ్చును. ఇది అప్పటి ధనాగారము. ఇంకను బైకి పోవుకొలది ఒక చిన్న మసీదు - దేవాలయము - రామదాసు జైలు - అమ్మవారిగుడి కన్పించును.

# ప్రొఫెసరు హనుమాన్

## శ్రీ జంధ్యాల పార్థసారథి

ప్రొఫెసర్ హనుమాన్ ప్రపంచవిఖ్యాత విజ్ఞాన శాస్త్రజ్ఞుడు, చరిత్రకారుడు కూడాను. చక్కని వక్త. ఆయన ఉపన్యాసాలను వినడానికి పండితపామరులు విశేషంగా ఆసక్తిచూపేవారు. అయితే బహుఅత్రగాడు. దానికితోడు మతిమరుపుకూడాను. ఏధ్యాస పడితే అదేతప్ప మిగతా విషయాలు అతనికి పట్టేవి కావు. ఒక్కొక్కప్పుడు ఎంతో ఆప్తులైన స్నేహితులు ఎదురుగావచ్చి పలుకరించినా పరధ్యానంగా మాట్లాడేవాడుకాడు. మరొకప్పుడు బస్సులో ప్రయాణంచేస్తూ తనచేతిలోని గొడుగు అక్కడే యుంచేసి మరొకరి గొడుగుని చేతపట్టుకొని దిగిపోయేవాడు. ఫౌంటెన్ పెన్‌లో సిరా పోయడానికి బదులు టీ పోసిన సందర్భాలు అనేకం యున్నవి. అందుకనే అతనిభార్య అప్పుడప్పుడూ "నేను గనుక జాగ్రత్తగా మీవెంటయుండి సహాయపడుతుండకపోతే దుస్తులు సయితము ధరించకుండా కాలేజికి వెళ్లేవారే"నని ఛలోక్తిగా అంటుండేది.

ఒకసారి ప్రొఫెసర్‌ను, ఆయన ముఖ్యశిష్యులను మరొక పట్నంలోని కాలేజీవారు విజ్ఞానశాస్త్ర చర్చలకు, ఉపన్యాసాలివ్వడానికి ఆహ్వానించారు. వారు బయలుదేరి వెళ్ళగానే ఆ కాలేజి ప్రధానాచార్యుడు సతీసమేతంగా స్వాగతమిచ్చాడు. కాని యింతలో తన సూట్‌కేసు, పక్కచుట్ట రైలులోనే యుండిపోయినవని జ్ఞాపకమొచ్చింది.

ఇది తెలిసి ఒకవిద్యార్థి తను రైలుస్టేషనుకు వెళతానన్నాడు సామానులను గురించి విచారించడానికి. కాని హనుమాన్ "ఎందుకు బాబూ! సైకిలు ఎవరిదైనాయుంటే నేనే వెళ్ళివస్తా"నన్నాడు.

కాలేజి ప్రధానాచార్యుడు యీ గడబిడంతా చూచి తన కుమార్తె లేడీస్ సైకిలుమాత్రం సిద్ధంగానున్నదని, అవసరమైతే వాడుకోవచ్చన్నాడు.

"సరే"నని హనుమాన్ లేడీస్ సైకిలు ఎక్కి రైలుస్టేషనుకు బయలుదేరి దారిలో కవరులు, కార్డులు కొనడానికని సైకిలు వాకిట్లోపెట్టి పోస్టాఫీసులోకి వెళ్ళాడు. తిరిగివచ్చి గడబిడగా తనెక్కివచ్చిన లేడీస్ సైకిలు వదిలేసి మరొక మగవారి సైకిలు ఎక్కి స్టేషనుకు చేరుకున్నాడు. అక్కడ స్టాండులో సైకిలు వదిలేసి లోపలికివెళ్ళి తన సామానులను గురించి రిపోర్టుచేసి బయటికివచ్చి తన సైకిలు దగ్గరకు వచ్చేసరికి తాను మొదట తీసుకొనివచ్చింది ఆడవాళ్ళ సైకిలని జ్ఞాపకమొచ్చి ప్రక్కనేయున్న మరొక లేడీస్ సైకిలు తీసికొని ఎక్కివచ్చి కాలేజి ప్రధానాచార్యుని షెడ్‌లో పెట్టేశాడు.

కొంతసేపటికి ఒక పోలీస్ యిన్స్పెక్టర్ వెంటాడివచ్చి కుర్చీలో కూర్చొని మాట్లాడుతున్న హనుమాన్‌తో "ఏమండీ! మీరు సైకిళ్ళను దొంగిలించినట్లు ఆరాతెలిసింది" అన్నాడు.

ప్రొఫెసర్ హనుమాన్‌కు చాలకోపం వచ్చింది ఆ మాటలకు. "పొరబడుతున్నారు — బాగా పారజూచుకోండి!" అని గర్జించాడు.

పోలీస్ యిన్స్పెక్టరుకు ప్రొఫెసరు స్వభావం తెలుసుకాబట్టి చిరునవ్వుతో "నాది కాదండీ! పొరబాటు — మీరు తీసికొనివెళ్ళిన సైకిలు తిరిగి తెచ్చారేమో దానిమీద పేరొకసారి చూచైనా చెప్పండి" అన్నాడు.

ప్రధానాచార్యుడు, అతని భార్య, హనుమాన్ షెడ్‌లోని సైకిలు దగ్గరకు వెళ్లారు చూడటానికి. అది వారి సైకిలు కాదని తేలింది. తర్వాత పోస్టాఫీసులో ప్రధానాచార్యుని పేరుగల సైకిలుండినదని, అక్కడనేయుండిన మరొక సైకిలు మాయమై రైలు స్టేషనులో దొరికిందని, రైలు స్టేషనులోనుండి యీ సైకిలు మాయమైందని పోలీస్ యిన్స్పెక్టరు చెప్పేసరికి ప్రొఫెసర్ హనుమాన్‌కు యీ అస్తావిస్తమంతా తనవల్లనే జరిగిందని గ్రహించాడు. అన్ని సైకిళ్ళ మీద వారివారి పేర్లుండటంవల్ల ఎవరి సైకిలు వారికి ఒప్పగించడానికి ఏర్పాటుచేసి, పాపం! ప్రొఫెసర్ హనుమాన్ వారికి క్షమాపణ చెప్పుకోవల్సి వచ్చింది.

# దుష్టులకు దూరంగా వుండాలి

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

ఒక అరణ్యంలో ఒకఒంటె, ఒకపులి చాలా స్నేహంగా ఉంటున్నవి. పులి ఎక్కడ, ఒంటె ఎక్కడ. పులి దుష్టజంతువు. ఒంటె సాధుజంతువు. వారిద్దరికి ఎంత స్నేహమంటే, పగలు, రాత్రి అనిలేకుండా ఒకచోటనే తిని, ఒకచోటనే పడుకునేవి. మిగతా సాధుజంతువులు ఒకనాడు ఒంటెను పిలచి "నీకీదుష్ట సావాసంపనికిరాదుగనుక, ఆ దుర్మార్గమైన పులి సావాసము మానుము" అని ఎన్నియోవిధముల బ్రతిమాలినవి. కాని ఒంటె "మా స్నేహము మీరనుకున్నంత అల్పమైనదికాదు. అది ఎంత దుష్ట జంతువైనా, మిత్రుణ్ణి చంపి తింటుందా!" అని స్నేహాన్ని వీడ నిరాకరించింది.

ఇలావుండగా ఒక కీకారణ్యంలో పులి, ఒంటె ప్రయాణం చేస్తున్నాయి ఒకరోజు. అపుడు పులికి మిక్కుటమగు దాహం వేసింది. ఆ పరిసరప్రాంతాల్లో ఎక్కడా కొలను అన్నమాట లేదు. పులికి దాహం పెరిగిపోయింది. ఒంటెకేం దానికి నీళ్ళ సంచి ఉంటుందిగా లోపల. దానికి దాహం లేదు. అపుడు పులి "మిత్రమా, నాకు దాహం ఎక్కువవుతున్నది. నీ పొట్టలో నీళ్ళసంచి ఉంటుందిగదా. నా ప్రాణం సంరక్షణార్థం, నిన్ను చంపి నీ నీటిసంచిని తీసుకోవాల్సి వచ్చినందుకు విచారిస్తున్నాను" అంటూ అమాంతం మీదపడి చంపింది. దుష్టసావాసం పనికిరాదని, పెద్దలు చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకొని ఒంటె ఏడుస్తూ పులికి బలి అయింది.

చూచారా! బాలలూ! మీరు మాత్రం దుష్టసావాసం చేయకండేం!




# చలనచిత్రాలు - బాలల విద్యాబోధన

**ఎల్. మోస్క్వినా**

బాలల చలనచిత్రాల ఉత్పత్తికి సోవియట్ దేశం పెద్ద ప్రాముఖ్యాన్నిస్తుంది. ఉక్రేనియా, బైలోరష్యా, ఉజ్బెకిస్తాన్, తుర్క్మీనియా, లిత్వానియా, లత్వియా, జార్జియా, ఆర్మీనియా మొదలైన రిపబ్లిక్లకు స్వంత ఫిలిమ్ స్టూడియోలు ఉన్నాయి. ఈ స్టూడియోలన్నీ ఇతర చిత్రాలతోపాటు బాలల చిత్రాలను కూడా తీస్తుంటాయి.

రిపబ్లిక్ల స్టూడియోలేగాక మాస్కోలోని మరి ఐదు స్టూడియోలు కూడా బాలలకోసం చలనచిత్రాలను తీస్తూఉంటాయి. ఇందుకోసం అవి ప్రఖ్యాతి పొందిన స్క్రిప్టు రచయితలనూ, డైరెక్టర్లనూ నియోగిస్తుంటాయి.

మాస్కో సులభవిజ్ఞాన చలనచిత్రాల స్టూడియో "విజ్ఞాన విషయాలు" అన్న పేరుతో రంగురంగుల చలనచిత్రాలను తయారుచేస్తున్నది. ఈ చలనచిత్రాల్లో సాంకేతిక వైజ్ఞానిక రంగాల్లో సాధింపబడిన సరికొత్త విషయాలనుగురించి బాలలకు తెలియజేయబడుతుంది. ఇలాంటి ఒక చలనచిత్రంలో ఇటీవల సోవియట్ బాలలకు మొట్టమొదటిసారిగా రోదసిలోకి పయనించి వచ్చిన కుక్కలు బేల్కా, స్త్రేల్కాలు చూపింపబడ్డాయి. ఈ వైజ్ఞానిక చలనచిత్రాల్లో బాలలకు ముఖ్యంగా ప్రపంచంలోని వివిధ దేశాలను గురించీ, పర్వతాలు, యెడారులు, అగ్నిపర్వతాలు, సముద్రాలు మొదలైనవాటిని గురించీ తెలియజేయబడుతుంది.

"విజ్ఞాన విషయాలు" అనే చిత్రాలు బాల సాంకేతిక నిపుణులు, జీవశాస్త్రజ్ఞులు జరిపే కృషిని గురించి ఇతర బాలలకు తెలియజేస్తుంటాయి. తమలాంటి బాలలే నౌకలు, యంత్రాలు మొదలైనవాటి నమూనాలను యెలా తయారుచేస్తున్నారో, పాఠశాలల ఆవరణల్లో మొక్కలను యెలా పెంచుతున్నారో చిన్నారి ప్రేక్షకులు వీటిలో చూడగలుగుతారు.

ప్రకృతికి సంబంధించిన చలనచిత్రాలు బాలలకు ప్రకృతి రహస్యాల గురించి తెలియజేస్తుంటాయి. సాంకేతిక శాస్త్రానికి సంబంధించిన చలనచిత్రాలు బాలసాంకేతిక ప్రవీణులు ఉపయోగించే సాంకేతిక పద్ధతులగురించి తెలియజేస్తుంటాయి.

సులభవిజ్ఞాన చలనచిత్రాల స్టూడియో తయారుచేసిన చలనచిత్రాలు కొన్ని యితరదేశాల్లో కూడా ప్రదర్శించబడుతున్నాయి. "ఉంగరం కథ" (పక్షులు వేరువేరు ఋతువుల్లో ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వలసపోయే విషయానికి సంబంధించిన కథ). "రెక్కల పరిరక్షకులు" (అడవులు పెరగటానికి పక్షులు యెలా దోహదంచేస్తాయో తెలియజేసే కథ) మొదలైన చలనచిత్రాలు యిదేవిధంగా ప్రదర్శింపబడుతున్నాయి. మరీ చిన్నవయస్సులోని బాలలకోసం "మామూలు విషయాలకు సంబంధించిన కథలు" అన్న శీర్షికతో ప్రత్యేకంగా చలనచిత్రాలు తయారుచేయబడుతున్నాయి.

కేంద్ర డాక్యుమెంటరీ చలనచిత్రాల స్టూడియో కూడా బాలలకోసం చలనచిత్రాలను తయారుచేస్తుంది. వాటిలో ముఖ్యమైనవి "బాలసంఘ సభ్యుల" వార్తాచిత్రాలు. ఈ వార్తాచిత్రాలను తీయటం 30 సంవత్సరాల క్రితం ప్రారంభమయింది. 9–15 సంవత్సరాలలోపు బాలల కుద్దేశింపబడిన చలనచిత్రాలివి. వీటిలో సోవియట్ దేశంలోని, ప్రపంచం తదితర ప్రాంతాల్లోని బాలలకు సంబంధించిన వార్తావిశేషాలు చూపబడుతుంటాయి.

"ప్రపంచ చిత్రపటంలో" అన్న శీర్షికతో తీయబడే చలనచిత్రాలు సోవియట్ బాలలకు అనేక దేశాలను గురించి తెలియజేస్తుంటాయి. భారతదేశం,

క్యూబా, ఘనా, కాంగో మొదలైన దేశాలలోని ప్రకృతి సౌందర్యాన్ని గురించీ, అక్కడి ప్రజల జీవితాన్ని గురించీ వాటి స్వాతంత్ర్య పోరాటాలను గురించీ యీ చలనచిత్రాలలో బాలలకు చూపింపబడుతుంది. సోవియట్ దేశంలో బాలలను సన్మార్గంలో నడిపించటానికి తోడ్పడే చలనచిత్రాలు తీయబడుతూ ఉంటాయి. ఉదాహరణకు జోయా ఘామిసా అనే చలనచిత్ర దర్శకురాలు బడికిపోకుండా గాలిగా తిరిగే సోమరిపోతులను అవహేళన చేస్తూ ప్రహసన చలనచిత్రాలను తయారుచేస్తూ ఉంటుంది. బాలలు అలాంటి చిత్రాలను చూచి గుణపాఠాలను నేర్చుకొంటూ ఉంటారు.

సోవియట్ ఫిలిమ్ స్టూడియోలు బాలల మనోల్లాసంకోసం దేవతా కథలను కార్టూన్ చలనచిత్రాలుగా తయారుచేస్తుంటాయి.

మాస్కోలోని గోర్కీ ఫిలిమ్ స్టూడియో, మాస్ ఫిలిమ్ స్టూడియో బాలల విభాగం పెద్దపెట్టున కథా చలనచిత్రాలను బాలలకోసం తయారుచేస్తుంటాయి.

త్వరలో మాస్ ఫిలిమ్ స్టూడియో మూడు కొత్త కథా చలనచిత్రాలను విడుదల చేయబోతున్నది. వాటిలో "నా మిత్రుడు కోల్కా" అనే చిత్రంలో బాలలలో ఉండవలసిన ఆదర్శప్రాయమైన మైత్రిని గురించీ, వారిలో ఉండవలసిన నిజాయితీని గురించీ చిత్రించబడుతుంది. 'రోడ్ రోలర్, వయోలిన్' అన్న చిత్రంలో కృషికీ, కళలకూ మధ్యగల సంబంధాలగురించి చర్చించబడుతుంది. "ఎర్ర తెరచాపలు" అన్న చిత్రంలో మానవుడు కంటూవచ్చిన కలలు యేవిధంగా నిజమవుతున్నాయో తెలియజేయబడుతుంది.

గత కొలది సంవత్సరాల్లో సోవియట్ పాఠశాలల్లో చాలావాటికి స్వంత ప్రాజెక్టర్లు యేర్పడ్డాయి. బాలలకు యీ ప్రాజెక్టర్లపైన చలనచిత్రాలు చూపింపబడుతున్నాయి.

(584 వ పేజీ తరువాయి)

చేశావు! మా దొరగారు నిన్ను, నీ పేరును కూడ గుర్తించుకొని వెంటాడుతున్నారు" అన్నాడు.

అది చూచి జనం గుంపు కూడారు. వేణు స్టేషనుకు ముందు నడుస్తుంటే కానిస్టేబిలు ఇజాక్ చేతికి బేడీలు తగిలించి వెనుకనే వెంట తీసికొనివెళ్ళాడు. నడచి పోతున్నంతసేపు వేణు ఇజాక్‌ను గురించే పరిపరి విధాల తలపోస్తూయున్నాడు.

◆ ◆ ◆

ఒకప్పుడు ఇజాక్ తన సహాధ్యాయి, స్నేహితుడు కూడాను. యిప్పుడో – తన అధీనంలోనున్న బందిపోటు దొంగ! తాము చదువుకునే రోజులలో అప్పుడప్పుడు తన దరిద్రాన్ని, నిస్సహాయతను దృష్టిలో నుంచుకొని ఇజాక్ "జీవయాత్రలో నీతినియమాల వల్ల పదవకాశాలు, సత్ఫలితాలు లేనప్పుడు ఏ పనైనా చేసి బ్రతుకవచ్చు" అని అంటుండిన మాటలు స్ఫురణకువచ్చి వేణు కండ్లు చెమ్మగిల్లాయి. ఇజాక్‌ను ఎలాగైనా కాపాడాలని అనుకున్నాడు; కాని తన ఉద్యోగధర్మమో - నేరస్తుణ్ణి శిక్షార్హుడుగా చేయాలి! తను కాపాడి యీసారికి పంపితే మరల యీ దోపిడీలు, జేబుదొంగతనాలు చేయడంకంటె శిక్షింపబడి ఇజాక్ సత్పురుషుడుగా సంస్కరించబడితే మంచిదనిపించింది; తన ఉద్యోగ ధర్మానికి విఘాతం లేకుండా కూడ యుంటుంది.

కానిస్టేబిలును పిలచి వేణు ఇజాక్ ఫైలు తెప్పించి మరొకసారి పరిశీలించాడు. అబ్బ! ఎన్ని దొంగతనాలు, ఎన్ని మోసాలు! ఇతర నేరస్తులతో పాటు ఇజాక్ కూడ వేణుముందు హాజరుపరచబడ్డాడు. వేణు, ఇజాక్ ఒకరి ముఖాన్ని మరొకరు పారజూచుకొని తలలు దించేసుకున్నారు. ఇజాక్ కండ్లనుండి రెండు నీటిబొట్లు నేలమీద రాలాయి, వేణు గుండె దడదడలాడింది. పోలీసును పిలచి ఖైదీని తీసికొనిపొమ్మని మూగసంజ్ఞ చేశాడు. మరునాడు నేరం విచారణ జరిగింది. రెండేండ్లు కఠినశిక్ష విధించబడింది. విచారణ సాగినంతసేపు వేణు కాలు కాలిన పిల్లిలాగ తిరిగినా తన విద్యుక్తధర్మాన్ని నెరవేర్చకలిగానుకదాయని సంతృప్తిపడ్డాడు. ఇజాక్‌ను పోలీసులు వాన్‌లో ఎక్కించుకొని బయలుదేరుతుంటే తిరిగి, వేణు ఇజాక్‌లు ఒకరొకరు జాలిగా చూసుకున్నారు. వాన్ కదలిపోయింది.

వేణు తన పూర్వస్మృతులతో యింటిదారి పట్టాడు. చదువుకునే రోజుల్లోని ఆనందం, స్వేచ్ఛ మళ్ళీ రావుకదాయని వాపోయాడు. ఒకసారి ఇజాక్ తమాషా చేస్తానన్నాడు. అతని జేబులోని రూపాయి ఎలాగ మాయమైపోతోందో చూడమన్నాడు. నిజంగానే మరొక అయిదు నిముషాలలో తన జేబులోని రూపాయి మాయమై ఇజాక్ జేబులోకి చేరింది. అబ్బ! అఘండమైన తెలివితేటలు - కాని వాని వినియోగమా! అందుకు కారణాలనేకం..." ఒక్కొక్కరి జీవితంలోని భావి వాసనలు ముందుగానే ప్రతిఫలిస్తవి. చదువుకునేరోజుల్లో ఇజాక్, వేణు సన్నిహిత స్నేహితులు. చాలాకాలం తరువాత ఆ యిరువురి స్నేహితుల సమాగమ పరిస్థితులు వేడినిట్టూర్పులకు, అశ్రుజలతర్పణానికి దారితీసింది. విధి, విరామంలేకుండా కాలం దొర్లిపోసాగింది.

వేణు ఉద్యోగధర్మంలో ఫైళ్లు వస్తున్నవి, పోతున్నవి. పట్టుదల, కార్యదీక్ష, శక్తిసామర్థ్యాలు వేణును ఉత్తమ ఉద్యోగిగా రాణింపజేయసాగినవి.

రెండేళ్లు గతించిపోయినవి. ఇజాక్ ఆరోజు విడుదల ఆర్డర్లు పుచ్చుకొని శిక్షనుండి బయటపడ్డాడు. ముందుకు నాలుగడుగులు వేశాడో లేదో "ఇజాక్!" అన్న పిలుపు వినిపించి వెనుకకు తిరిగి చూచాడు. ఇన్స్పెక్టర్ వేణు! – ఆ పిలుపు ఇజాక్ గుండెల్లో నుండి దూసుకపోయింది. మరొక క్షణంలో వారిరువురు ఒకరిచేతుల్లో ఒకరు వాలిపోయారు. గడచిన విషయాలు... హృదయస్పందనంలో ఒకరికొకరు తెలుపుకున్నారు. మూగవోయిన గండుగోయిలలు... ఒక్కసారి చివురాకులు మేసికూసినట్లు... వారి మనోవేణువులు పులకరించి పలుకరించుచున్నవి. పునఃసమాగమము వారి పశ్చాత్తాపము మాటలకందని స్థాయిలో ఒకరొకరికి దగ్గరగా చేర్చింది – పవిత్రసమాగమము.

ఇజాక్ మనస్తత్వంలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. ఎన్ని కష్టాలను, దుస్థితిని ఎదుర్కొవాల్సివచ్చినా నీతినియమాలే మానవుని ఔన్నత్యానికి తోడ్పడతవనే విశ్వాసం ప్రబలింది. భావాలు మార్చుకున్నాడు. తనకు కూడుగుడ్డ కరువైనవని గతంలో అడ్డదారిన నడిచాడు. పశ్చాత్తాపం ఎంతటి దుర్మార్గానికైనా విరుగుడు! జైలుశిక్ష! అందులోనూ తన స్నేహితుడు వేణు ద్వారానే – అతనిని మార్చె

సింది. నీతి, నిజాయితీలతో జీవయాత్ర కుపక్రమించాడు ఇజాక్.

◆ ◆ ◆

ఒకసారి క్రిందకుమళ్ళిన బండిచక్రం అకులం పైకి వచ్చేలాగున స్వాతంత్ర్యోద్యమంలో ఇజాక్ చిత్తశుద్ధి గల స్వచ్ఛందసైనికుడుగా రాణించాడు. ప్రజల ఆదరాభిమానములతో అఖండత్యాగాలు చేసి, వీరోచితంగా పోరాడి ఉద్యమానికి నాయకత్వం వహించాడు. లాఠీదెబ్బలను, తుపాకిగుండ్లను, చరసాల శిక్షలను సయితం జంకకుండా స్వాతంత్ర్యసిద్ధికి పాటుపడిన యోధులలో ప్రథమశ్రేణివాడైనాడు. అతని ధైర్యసాహసాలు, వీరోచితపోరాటము వేలు, లక్షలమందిని ఉత్తేజపరచి ఉత్సాహపరచి రణరంగానికి దూకించినవి. చివరకు విజయదుందుభులు మ్రోగినవి. ఇజాక్ జాతీయనాయకుడుగా గుర్తించబడ్డాడు జయజయధ్వానాల మధ్య.

ఇజాక్‌ను పూలమాలలతో బ్రహ్మరథం పట్టారు ప్రజలు. ఇజాక్ రాజ్యాధినేత — ఊరేగింపు పోలీసు స్టేషను ముందుకురాగానే వేణు ఆప్యాయంగా ముందుకువెళ్ళి ఇజాక్ మెళ్ళో పూలదండవేసి అభినందించాడు. వేణు, ఇజాక్ ముఖాలపై చిందులు త్రొక్కిన అనందం యింతింతని వర్ణించలేము. ఊరేగింపు కదిలింది. వేణు, ఇజాక్ వంక చూస్తూ నిలబడ్డాడు. గతాన్ని తలచుకున్న వారి మనోప్రవర్తులెలాగుండియుంటవో...

వేణు వాలుకుర్చీలో కూర్చొని కండ్లుమూశాడు. తన చిన్ననాటి రోజులు—ఇజాక్ "తనకోసం ఏదైనా త్యాగం చేయవచ్చు. నీతినియమాలు జీవయాత్ర సరళంగా సాగడానికి ఉపయోగపడకపోతే అనవసరం" అనేవాడు. మరి తనో "ఇతరులకొరకు ఎట్టి త్యాగాలయినా చేయాలనేవాడు నీతినియమాలు తప్పినవ్యక్తి సమాజంలో రాణించలేడనేది వేణు వాదన – ఒకరోజున వేణు, ఇజాక్ యిద్దరూ కలిసి బడికి వెళ్ళారు. నోటీస్ బోర్డుమీద జీతంకట్టనివారి పేర్ల లిస్టులో ఇజాక్ పేరుంది. దాంట్లోనే అతని పేరు హాజరుపట్టీనుండి తొలగించబడిందని కూడనున్నది. అది చూడగానే ఇజాక్ వేణువంక జాలిగా చూచాడు. వేణు గడికి వెళ్ళివచ్చి జీతం కడదామని స్కూలును వదలి వెళ్ళాడు. కాని తిరిగి వచ్చేసరికి ఇజాక్ స్కూలులో లేడు. ఆరోజంతా ఇజాక్ కనుపించలేదు. మరునాడు సాయంకాలం బడినుండి యింటికి వెళ్ళేసరికి వేణుకొరకు ఇజాక్ ఎదురుచూస్తూ అరుగుమీద కూర్చొనియున్నాడు. వేణు అతనిని చూడగానే దుఃఖం పొంగిపొరలింది. ఏం మాట్లాడలేక అలాగే క్రిందచూస్తూ నిలబడ్డాడు. కొంతసేపయ్యాక "వేణూ! నాకొరకు ఎన్నాళ్ళిలా ఖర్చుపెడతావు? నాకు చదువుకొని బాగుపడే యోగముంటే మానాన్నే బ్రతికియుండేవాడు" అంటూ ఇజాక్ బావురుమన్నాడు. వేణుకు అతనిని ఏలా ఓదార్చాలో తెలియక అతనిని కౌగలించుకొని ఏడ్చాడు. ఇజాక్ మెల్లగా కండ్లు తుడుచుకొంటూ లేచి "నేను వెళ్ళివస్తాను వేణూ!" అన్నాడు.

"ఎక్కడికి వెళ్ళడం?" రుద్ధకంఠంతో.

"ఎక్కడికని చెప్పేది! యీ విశాల ప్రపంచంలో ఎక్కడ నిలబడడానికి కాస్త చోటు దొరికితే అక్కడికి!"

వేణు నోటమాట పెగలలేదు.

"ఏ దొంగబ్రతుకైనా బ్రతుకగలను. ఎప్పటికైనా గుర్తుకువస్తే మాత్రం ఒక్కసారి నన్ను — బీదస్నేహితుణ్ణి తలచుకో!" అంటూ ఇజాక్ వెళ్ళిపోయాడు.

రోజులు మారాయి. ఇజాక్, వేణులు ఒకే సినిమాను చూస్తున్నారు. ఏదో మాటల సందర్భమున వేణు "ఏరా ఇజాక్! అలాంటి పనికెందుకు పూనుకున్నావురా! అంతకంటే బ్రతుకడానికి మరొక మార్గం కనుపించలేదా?" అన్నాడు. ఇజాక్ ముఖం నల్లబడింది. తలెత్తి చూడలేకపోయాడు. మెల్లగా "అవును – ఒక్కసారి జీవితంలో మచ్చ ఏర్పడితే చెరగిపోవడం అసంభవం. జీవితాంతంవరకూ..." అని అన్నాడు. వేణు చలించిపోయి నాలిక కొరుక్కున్నాడు. ఇద్దరూ మిత్రులూ సినిమా వదలగానే వారివారి గమ్యస్థానాలకు బయలుదేరివెళ్ళారు.

అప్పటినుండి ఇజాక్, వేణు ఎక్కడోక్కడ టీపార్టీలలోనో, విందులలోనో, మీటింగులలోనో తరచుగా కలసికొంటూండేవాళ్లు. వేణు, ఉద్యోగధర్మంలో అవలంభించే నిజాయితీ, చిత్తశుద్ధి, శక్తిసామర్థ్యాలను చూచి ఇజాక్ పొంగిపొరలే ఆనందంతో "అందరూ నీలాగేయుంటే ధర్మం నాలుగు పాదాల నడుస్తుంది" అనేవాడు. ఇద్దరూ నిండుహృదయాలతో నవ్వుకొని పరస్పరం అభినందించుకునేవారు విచ్చిన నందివర్ధనాల్లాగ. పశ్చాత్తాపము మానవుని ఉచ్ఛస్థితికి తెస్తుందనుకునేవాడు వేణు.

వేణు ఎంత సమర్థుడుగా వ్యవహరించినా లంచం తీసుకున్నాడని నేరం మోపబడింది. ఏమి చేయడానికి పాలుపోక తిరుగసాగాడు. పరిస్థితుల ప్రోద్బలంవల్ల నేరం చేశాడు — పట్టుబడ్డాడు. తనకీనాడు కావలసింది రక్షణ. అది లేకుంటే పతనం! అన్నివిధాల పతనం. తన్నీ ప్రపంచంలో రక్షించగలది ఇజాక్ ఒక్కడు మాత్రమే. అతనిని పోయి ఏమని అడుగగలడు! తానతనికి చేసిన అపకారానికి - కాదు - తన ధర్మమును నిర్వహించాడు. ఇజాక్ సహాయం కోరడమా, మానడమా అనే సందిగ్ధం ప్రతినిముషం బాధించసాగింది. ఇజాక్‌ను కలసికోవాలని నాలుగయిదుసార్లు బయలుదేరి వెళ్ళాడే కాని యింటి దగ్గరకు వెళ్ళి వెనుకకు తిరిగివచ్చాడు.

నేరం విచారణ మరునాడే. ఈ విషయం తెలిసి ఇజాక్ ఏమనుకుంటాడో! ఎంత బాధపడతాడో! అతనికి తనపట్లనున్న ప్రేమ, అభిమాన, ఆదరణలు ఏమయిపోతవోననే ఆందోళన ఎక్కువయింది. ఇజాక్‌ను పోయి తాను చేసిన నేరానికి శిక్షనుండి తప్పించమని అడగడం ఎంత ఆత్మగౌరవానికి భంగకరం! అయితే అంతకంటె గత్యంతరము! - యీ ఆలోచనలతో కుప్పకూలిపోయి కూర్చున్నాడు. చుట్టూ నిశ్శబ్దం — ఫాను తిరుగుతున్న శబ్దంమాత్రం వినిపిస్తున్నది. రాత్రి పదిగంటల సమయం. వేణు గుండెలు దడదడలాడుతున్నవి.

తెల్లవారితే విచారణ. తాను అబద్ధమాడలేడు. అబద్ధమాడకపోతే మరి ఏం జరుగుతుందనికూడ తెలుసు. తలవంచుకొని కూర్చొనియున్నాడు. గది లోను, బయటకూడ నిర్మానుష్యంగా నున్నది. ఆ సమయం ఎవరో వస్తున్నట్లు చెప్పుల శబ్దం కాగానే తల పైకెత్తి ముందుకు చూచాడు. ఇజాక్ గదిలో ప్రవేశించాడు. అతనిరాక వేణుమీద పిడుగుపడ్డట్లయింది. స్వయంగా కుర్చీని ముందుకు లాక్కొని ఇజాక్ కూర్చుంటూ "వేణూ!" అని పలుకరించాడు. అది వినగానే వేణు కండ్లవెంట బొలబొల నీళ్లు కారినవి. నోటమాట పెగలలేదు.

ఇజాక్ మరింత దగ్గరగా కుర్చీ జరుపుకొని సానుభూతితో "వేణూ! అంతా నాకు తెలుసు. ప్రతి మానవుడు తప్పు చేయటం సహజం. కాని పశ్చాత్తాపపడి అలాంటివానినే మరల చేయకుండా జాగ్రత్తపడటం మన కర్తవ్యం" అన్నాడు.

వేణు ఏమి మాట్లాడలేదు.

"నేను అంతా విన్నాను. అయినా, నీకేం బాధపడకు! భగవంతుడు నిన్ను, నన్ను కూడ రక్షిస్తాడు. గతాన్ని చూచి గుణపాఠం నేర్చుకొని జాగ్రత్తగా నుందాం!" అన్నాడు.

విచారణ ప్రమేయం లేకుండానే వేణుమీద నేరం గాలిబుడగలాగ తేలిపోయింది. ఇజాక్, వేణు ఆప్త మిత్రులు. వారి పరస్పర ప్రేమానురాగాలు, కొండల మీది మంచులాగ ఘనీభవించసాగింది.

విధి విరామం ఎరుగని కాలము, దాని ననుసరించిన గడియారం, క్యాలెండరు తేదీలు దొర్లిపోతున్నవి.




**భక్తిసంకీర్తనము :** శ్రీ స్వామి శివానందసరస్వతి మహారాజ్. అనువాదకులు: 'శివానందపాదసేవక్' శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతి, శ్రీనండూరి వెంకటసుబ్బారావు. ప్రకాశకులు: యోగవేదాంత అరణ్యవిద్యాపరిషత్తు, శివానందనగరము, (వయా) ఋషీకేశము, డెహ్రాడూన్ జిల్లా. వెల రు. 4 లు.

ఇది అమూల్యమైన గ్రంథము. భక్తివిశ్వాసములతో కూడిన సాధనకు యిది విశేషముగా తోడ్పడగలదు. ఇందులో భగవన్నామముయొక్క మహాత్మ్యము, భగవంతుని స్వరూప విజ్ఞానము, భగవన్నామ సంకీర్తన మార్గములు, భక్తితత్త్వము మున్నగు ఆధ్యాత్మిక విషయములు సులభపద్ధతిలో వివరించబడినవి. ఈ గ్రంథపఠనము మానవజీవయాత్రను రక్తిముక్తి సాధనలకనువుగా రూపొందించగలదు.

**మనరాజకీయాలు :** ఆచార్యమామిడిపూడి వేంకటరంగయ్య. తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నము, కృష్ణాజిల్లా, వెల 75 న. పైలు.

ఇందలి శీర్షికలు అయిదు భాగములుగా విభజించబడి మొదటిదానిలో రాజ్యము, దానినిర్వహణ, పాలనానిర్వహణ జరిపేవారనిగురించి వివరించబడినది. తర్వాత ప్రస్తుతం అధికారంలోనున్న కాంగ్రెస్ ప్రభుత్వాల విధానాలు, నిర్వహణగలదు. మూడవభాగంలో ప్రస్తుతపాలనా నిర్వహణలోనిలోపాలు, నాల్గవభాగంలో ప్రతిపక్షాల పాత్రధారణలో లోపాలు, అయిదవభాగంలో ప్రజల బాధ్యతలు, ధర్మాలు, గుణదోషాలు సూక్ష్మంలో మోక్షంగా విపులీకరించబడినవి. గ్రంథకర్త అపార అనుభవవిశేషములేకాక వాస్తవిక పరిజ్ఞానంతో దేశాన్ని అభ్యుదయ మార్గంలో నడుపడానికని రచించినదీ గ్రంథము. ఈ గ్రంథ పఠనము ప్రతియొక్కరి ఆత్మపరిశీలనకు. బాధ్యతాయుతలగుటకు తోడ్పడగలదు.

**మల్లెమొగ్గలు :** 'కోటసోదరకవులు' ప్రచురణకర్తలు : కవిచంద్ర గ్రంథమాల, 147 మింట్‌స్ట్రీటు, మద్రాసు 1 - వెల 75 న. పైలు.

ఇది మాధ్యమిక తరగతుల బాలబాలికలకు పాఠ్యగ్రంథముగానుండుటకనువైనదిగా రచింపబడినది. బాలలలో ఆసక్తికలిగించు విషయాలతోగల మూడు చారిత్రాత్మక కథలను స్వయముగా చదువుకొని అవగాహనముచేసికొనుటకని యీ కూర్పు ఉద్దేశించబడినది.

♦ ♦ ♦ ♦

కౌముదీపరిషత్తు (విజయనగరం) రజతోత్సవసంచిక మా కార్యాలయమునకు చేరినది. ఇందులో పరిషత్తుకు సంబంధించిన వివరాలతోబాటు ఉత్తమకవులు, రచయితలు రచించిన వ్యాసములు, గేయములు, పద్యములుగలవు. ఈ సంచిక సర్వాంగ సుందరమైనదే కాక విజ్ఞానవికాసములను వెదజల్లి రంజింపజేయునదిగానున్నది.

---

## సంక్రాంతి సంచిక

ఎప్పటియట్లు గృహలక్ష్మి 'జనవరి సంచిక సంక్రాంతి ప్రత్యేకశీర్షికలతోటి ఆకర్షణీయంగా వెలువడుతుంది. రచనలను డిశంబరు నెలాఖరులోపల పంపాలి! పాఠకుల, అభిమానుల రచయితల ఆదరాభిమానములకు ఎదురుచూస్తున్నాము.

సంపాదకుడు.

# సంపాదకీయములు

## దేశభద్రత - ప్రజలు

పార్లమెంటు ప్రస్తుత సమావేశంలోనే దేశభద్రతకు భంగంకలిగించే వ్యక్తులను శిక్షించుట కనువుగా బిల్లు ప్రతిపాదింపనుండటం హర్షింపతగిన విషయము.

గతచరిత్ర సత్యాలననుసరించి మనదేశం పరాధీనమయింది దేశద్రోహులవల్లనే యను విషయము గమనించతగినది. ఏ పార్టీకి, ఏ వర్గానికి చెందినవారైనా దేశంయొక్క శాంతిభద్రతలకు, రక్షణకు భిన్నంగా వ్యవహరించినచో ముమ్మాటికి శిక్షార్హులే. జాతీయశ్రేయస్సు శాంతిభద్రతలమీద నాధారపడియుండునవి కాబట్టి వానిని రక్షించుట దేశంయొక్క ఉమ్మడిబాధ్యత.

## కృష్ణా, గోదావరీజలాల వినియోగం.

కృష్ణ, గోదావరి జలాల వినియోగానికి సంబంధించిన 1951 ఒప్పందాన్ని తిరగతోడటానికి మైసూరు, మహారాష్ట్ర స్టేటులు ప్రయత్నించుట చాల శోచనీయము. ముఖ్యంగా ప్రజాపార్టీ కార్యవర్గం స్పష్టీకరించినట్లుగా ఒప్పందం జరిగిన తొమ్మిది సంవత్సరాలకు దాని మంచిచెడ్డల ప్రసక్తి లేకుండా యీనాడు దానికసమ్మతి తెలియజేయడం అర్థరహితము. మధ్యవర్తి పరిష్కారానికి యీ సమస్య వదలాలని సూచించడంలో సయితము న్యాయములేదు. మధ్యవర్తి పరిష్కారమనునది ఉత్పన్నమైన వివాదాలలో కాని, షుమారు పది సంవత్సరాలనాడు జరిగి, అమలులోనున్న ఒప్పందమును మార్చే విషయంలో వినియోగపడుటకు కాదు.

## ప్రపంచ బాలల విద్యావసతులు

ప్రపంచమందలి బాలలలో సగంమందికి మాత్రమే విద్యాభ్యాసానికి పాఠశాలల వసతి యున్నదనియు, మిగిలినవారికి విద్యావకాశములు లేవని తెలుస్తున్నది.

బాలలు ప్రతిదేశ అభివృద్ధి అభ్యుదయాలకు జీవకర్రలాంటివారు. వారి ఆయురారోగ్యాలతో బాటు విద్యావిజ్ఞానములు దేశాలను, ప్రపంచాన్ని కూడ సౌభాగ్యవంతం చేయగలవు. నేటిబాలలు రేపు పౌరులై బరువుబాధ్యతలను వహించి లోకకళ్యాణాన్ని తీర్చిదిద్దవలసినవారు కాబట్టి ప్రపంచ మొత్తంమీద విద్యా ప్రణాళికలకు ప్రాధాన్యమివ్వాలని భారత్ - బ్రిటను లు తీర్మానించడం అభివందనీయము. ఈ ప్రణాళికలు సుశిక్షణాయుత విద్యావిజ్ఞానములతో ప్రపంచములో శాంతిభద్రతలను, పరస్పర సద్భావసాన్నిహిత్యాలను, సమరసమైక్యతలను ప్రోత్సహించే వసతులు గల పాఠశాలలను కావలసినమేరకు ఏర్పరచకలుగాలి. ఇందులో అధికార, అనధికార సహాయసహకారములు అత్యవసరము.

## మద్యనిషేధచట్టం అమలు

మద్యనిషేధచట్టంవలన మద్యపానం అధికమయినదని ఆంధ్రమంత్రి శ్రీ సుందుముల నరసింగరావు వెల్లడించడం చాల శోచనీయంగా నున్నది. మద్యనిషేధచట్టం సామాన్యప్రజల ఆయురారోగ్యాల నుద్దేశించి, ఆర్థికదుస్థితినుండి, నైతికపతనమునుండి ఉద్ధరించి సుఖసౌభాగ్యములు చేకూర్చడానికని అమలులోనికి తేబడింది. ప్రజలు మద్యపాన నిషేధం తమ స్వీయసౌభాగ్యానికని యుద్దేశించినదని గుర్తించి చాటుమాటులన త్రాగడమో లేక అమ్మి త్రాగుడును ప్రోత్సహించడమో దేశానికి, సంఘానికికూడ ద్రోహము తలపెట్టడమని గుర్తించి వ్యవహరించాలి! ప్రభుత్వము త్రాగుబోతులను, త్రాగుడును ప్రోత్సహించువారిని నిర్దాక్షిణ్యముగా దండించి, శిక్షించడానికి కట్టుదిట్టాలు చేయవలసియున్నది.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# సిరిసిరిమువ్వలు

''ఏమండీ! నాకు మీరు వెయ్యి బొద్దెంకలను సప్లయిచేయాలి'' అని అడిగాడు ఒకాయన జంతుప్రదర్శనశాలకు వెళ్ళి.

''ఏమిటీ! వెయ్యి బొద్దెంకలా! మీకేమైనా మతిపోయిందా!- ఎందుకన్ని?''

''అది కాదండీ! నేనుంటూయున్న యిల్లు ఖాళీచేసే సందర్భమున ఆ యింటావిడ నేను ఆ యింట్లో ప్రవేశించేటప్పుడున్నవాటి నన్నిటిని తనకు ఒప్పగించి పోవాలంటున్నది.''

♦ ♦ ♦

ఈమధ్య పేపరు ప్రకటన చూచి ''వాడిన మందుతో మీ భార్యకు ఆరోగ్యం చేకూరిందా?''

''అబ్బే! ఆ బుడ్డికి చుట్టిన డైరక్షన్స్ కాగితము చూచి చదువుకున్న తరువాత మరి రెండు జబ్బులు ఏర్పడినవి ఆమెకు.''

♦ ♦ ♦

ఒక యువకుడు ఒక యింటికి తరచుగా వెళుతుండేవాడు. ఆ యింటి యజమానికి నలుగురు కుమార్తెలున్నారు. వారిలో ఎవరి వివాహమాడుదామూ యని అస్తమానం తికమకలు పడుతుండేవాడు.

ఒకరోజు సాయంకాలం యింట్లో పెద్ద అమ్మాయి తప్ప మిగిలినవారందరు ఎక్కడికో వెళ్లారు. ఆ యువకుడు వచ్చీరాగానే ''సుశీ! యివాళ చాల అలసిపోయినట్లు కనుపిస్తున్నావు!'' అన్నాడు కుర్చీలో కూర్చొంటూ.

''కొద్దిగా - నేనే యీరోజున వంట చేశాను. మా అమ్మకు వంటవాడికంటె నేను చేస్తేనే యిష్టం. పూరీలు, ఉర్లగెడ్డ కూర తయారుచేశాను. మా నాన్నగారికి అవి అంటే చాల యిష్టం. రామములగ పండ్ల చారు, కందిపచ్చడి చేశాను - అవంటే మా అందరికి చెప్పజాలనంత ఆనందం.''

''భలే బాగుంది! అయితే నిన్నొక ప్రశ్న అడగాలనియుంది; నీ జవాబుమీద నే నా జీవితానందం ఆధారపడియుంటుంది.''

''ఏమిటది?''

''సుశీ! మీ చెల్లెళ్లలో నొకర్ని నేను వివాహమాడితే ఆమెతోబాటు నీవు మా యింట్లో నుంటావా?''

♦ ♦ ♦

ఒక అబ్బాయికి ట్యూషన్ మాష్టరు చదువుచెప్తూ ''నీకు టాన్సిల్సు ఎక్కడ నున్నవో తెలుసా'' అని అడిగాడు.

బాలుడు ''గొంతులోనండీ!'' అన్నాడు.

''అయితే నీ కడుపెక్కడ నున్నది?''

''నా చొక్కాక్రిందే కదండీ!''

♦ ♦ ♦

ఒకడాక్టరు రోగిని ''ఏమయ్యా! నీకు నిద్రలేమికి కారణమేమిటి? పడుకోబోయేటప్పుడు ఏదైనా తిని పడుకోపోయావా!''

రోగి ''అదేమిటి డాక్టరుగారూ! మీరే కదా పడుకోబోయేటప్పుడు ఏమి తినవద్దని యింతకు ముందొకసారి చెప్పారు!''

డాక్టరు ఠీవిగా! ''అదా - అలా అని క్రిందటి జనవరిలో చెప్పాను. కాని దరిమిలా యింతవరకు విజ్ఞానశాస్త్రరంగంలో అనేకమార్పులు వచ్చినవి'' అన్నాడు.

'సిపిసి'

14836